



ప్రవేశపెడ్తున్నాం
CHILDREN'S COLLEGE & CAREER FUND














# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి


## అసలు కారణాలు!

మన దేశంలో ఉచిత ప్రాథమిక విద్యావిధానం అమలులో ఉన్నప్పటికీ, ప్రాథమికవిద్య పూర్తికాకుండానే సగం మంది విద్యార్థులు బడి మాను కుంటున్నారు! అలా మానుకోవడానికి అసలు కారణాలు ఏమిటని తెలుసు కోవడానికి కొన్ని రాష్ట్రప్రభుత్వాలు పరిశోధనలు జరిపాయి.

తమిళనాడులో జరిపిన సర్వేలో, పిల్లలు బడి మానుకోవడానికి ముఖ్య కారణం తల్లిదండ్రుల ఆర్థిక దుస్థితి అని తెలిసింది. ఇంటిపనులూ, వంటపనులూ, బయటి పనులూ చేసి ఆర్థికంగా కన్నవాళ్ళను ఆదుకోవలసి ఉండడంవల్లపసిపిల్లలుసక్రమంగా బడికివెళ్ళలేకపోతున్నారని తెలియ వచ్చింది!



మహారాష్ట్రలో జరిపిన మరొక సర్వేలో — బడిలో నేర్పే పాఠాలూ, బోధనాపద్ధతులూ, పిల్లలను ఆకర్షించే విధంగా లేవనీ, ముఖ్యంగా పాఠ్యపుస్తకాలు కఠినంగా ఉండడంతో వాటికి భయపడి పిల్లలు బడికి వెళ్ళడం మానుకుంటున్నారన్న విషయం వెలుగులోకి వచ్చింది!

ఢిల్లీలో జరిపిన వేరొక సర్వేలో — పాఠ్యపుస్తకాలకు సంబంధించిన మరొక విషయం తెలియవచ్చింది. నర్సరీ స్కూలుకు వెళ్ళే విద్యార్థులు ఏడాదికి కనీసం ఏడు పుస్తకాలూ, ఆ తరవాత పది పుస్తకాలూ బట్టీ పెట్ట వలసి ఉన్నది. ఇది పిల్లల తలకు మించిన బరువు అని వేరుగా చెప్ప నవసరం లేదు.



పిల్లలను వేధించే ఇటువంటి విద్యావిధానం గురించి పలువురు విద్యావేత్తలూ, మేధావులూ అనేకసార్లు తమ అసంతృప్తిని వ్యక్తం చేశారు. పసిపిల్లలను జడిపించి, వాళ్ళను బడికి వెళ్ళకుండా చేసే ఈనాటి విద్యా విధానంలో మార్పులు తీసుకురావడం చాలా అవసరం!


సంపుటి: 92 సెప్టెంబర్' 93 సంచిక:3

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00




# క్యూబా పరిస్థితులు

క్యూబాలో విప్లవం జరిగి గత జూలై 26వ తేదీకి నలభై ఏళ్ళు పూర్తయింది. అయినప్పటికీ ఆ దేశంలో చోటుచేసుకున్న ఆర్థికమాంద్యం కారణంగా ఈ యేడు గత సంవత్సరంలాగా వార్షికోత్సవ వేడుకలను జరుపుకోలేదు. నలభై సంవత్సరాలకు పూర్వం, కమ్యూనిస్టు సిద్ధాంతాలతో ఉత్తేజితుడై ఫీడల్ కాస్ట్రో రుజ్ అనే యువ న్యాయవాది, తన వంటి తిరుగుబాటుదారులు మరి కొందరిని పోగుచేసుకుని శాంటియాగో సైనికస్థావరం మీద దాడి చేశాడు. నియంత ఫుల్ గెన్సియో బాటిస్టా నిరంకుశ పాలనను కూలదోయడానికి సాగిన ఆ పోరాటంలో పలువురు వీరులు ప్రాణాలు కోల్పోయారు. కాస్ట్రో పట్టుబడి జైలు పాలయ్యాడు. మూడేళ్ళ తరవాత ఆయన మరొకసారి విప్లవం తీసుకురావడానికి ప్రయత్నించి విజయం సాధించలేక పోయాడు. 1959వ సం॥ జనవరి ఒకటవ తేదీ చేసిన మూడవ ప్రయత్నంలో కాస్ట్రో విజయం సాధించడంతో, నియంత బాటిస్టా ప్రాణాలతో తప్పించుకుని దేశం వదిలి పారిపోవలసివచ్చింది.



కాస్ట్రో హవానాలో సోషలిస్టు ప్రభుత్వం నెలకొల్పాడు. దాంతో అంతవరకు క్యూబా మీద పరోక్షంగా అధికారం చెలాయిస్తూ వచ్చిన పొరుగు దేశమైన అమెరికాతో సంబంధాలు చెడాయి. 1960వ సం॥లో ప్రధాని కాస్ట్రో ఎటువంటి నష్టపరిహారం చెల్లించకుండా తన దేశంలోని అమెరికా వ్యాపార సంస్థలను వశపరచుకున్నాడు. ఆ చర్యకు ఆగ్రహించిన అమెరికా, క్యూబాతో దౌత్యసంబంధాలను రద్దుచేసి, మరు సంవత్సరం దానిని ఆక్రమించడానికి ప్రయత్నించి, పరాజయం పాలయింది.

ఆతరవాత కాస్ట్రో, క్యూబా కమ్యూనిస్టు దేశంగా కొనసాగుతుందని ప్రకటించి, కమ్యూనిస్టు మార్గంలో దేశ ఆర్థికాభివృద్ధి పథకాలు రూపొందించాడు. క్యూబా ఏకైక రాజకీయ పార్టీకి క్యూబా కమ్యూనిస్టు పార్టీ అని పేరు పెట్టాడు. 1976వ సం॥లో ఆయన క్యూబా అధ్యక్షుడయ్యాడు. ఆయన 1979వ సం॥ లో అలీనోద్యమానికి అధ్యక్షుడై 1982వ సం॥ వరకు ఆ పదవీ బాధ్యతలు నిర్వహించాడు.

క్రిస్టఫర్ కొలంబస్, అమెరికాను కనుగొన్న 1492వ సం॥లోనే క్యూబాలో కూడా అడుగుపెట్టాడని చెబుతారు. ఆనాటి నుంచి అది స్పెయిన్ అధీనంలోకి వచ్చింది. 1898వ సం॥ లో జరిగిన స్పెయిన్ అమెరికా యుద్ధంలో స్పెయిన్ ఓడిపోవడంతో క్యూబా అమెరికా వశమయింది. మూడేళ్ళ తరవాత అంటే–1902వ సం॥ లో క్యూబా స్వతంత్ర దేశమయింది. అయినప్పటికీ, క్యూబా విదేశ విధానాన్ని అమెరికా నిర్ణయించేది. 1933వ సం॥ లో నియంత బాటిస్టా అధికారాన్నిచేజిక్కించుకున్నాడు. 1944 నుంచి 1952 వరకుగల మధ్యకాలంలో తప్ప 1959 వరకు క్యూబాలో బాటిస్టా నిరంకుశపాలనే కొనసాగింది.

ఫీడల్ కాస్ట్రో పరిపాలన కు వచ్చినప్పటి నుంచీ అంటే 1959 నుంచి నిన్నమొన్నటి వరకు క్యూబాకు సోవియట్ యూనియన్ మద్దతూ, సహాయసహకారాలూ ఉండేవి. తూర్పుఐరోపా దేశాల అండదండలు లభించాయి. అయితే, ఇటీవల అక్కడ కమ్యూనిస్టు ప్రభుత్వాలు పతనమైపోయి, సోవియట్ యూనియన్ ఛిన్నాభిన్నమై పోయాక క్యూబా ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. 'లాటిన్ అమెరికన్ ఫెడరేషన్' సభ్యదేశాలూ, క్యూబాకు మిత్రదేశాలూ అయిన కొలంబియా, అర్జెంటీనాలు క్యూబాను అమెరికాతో దౌత్య సంబంధాలు పునరుద్ధరించు కోవలసిందిగా కోరుతున్నాయి. అప్పుడే, అమెరికా క్యూబామీద విధించిన ఆంక్షలను తొలగించగలదని ఆ దేశాలు భావిస్తున్నాయి. ఆ ప్రతిపాదన అమెరికా నుంచి వచ్చినట్టయితే, ఆ విషయాన్ని పరిశీలించగలననీ, అయితే, సోషలిస్టు విధానాలను వదిలిపెట్టడం మాత్రం జరగదనీ కాస్ట్రో ప్రకటించాడు.




1993 ఫిబ్రవరి నెలలో జరిగిన ఎన్నికలలో నేషనల్ అసెంబ్లీలో 99 శాతం స్థానాలను కాస్ట్రో పార్టీ గెలుచుకున్నది. ఈ సందర్భంగా 66సం॥ నిండిన క్యూబా జాతీయ నాయకుడు కాస్ట్రో ఇలా అన్నాడు: "మరొక ఐదేళ్ళ తరవాత నా దేశ ప్రజలు నన్ను మళ్ళీ అభ్యర్థిగా పోటీ చేయమని కోర రనుకుంటాను."

కమ్యూనిస్టు ప్రభుత్వాలు కొనసాగుతున్న చైనా, వియత్నాం వంటి కొన్ని దేశాలలో క్యూబా ఒకటి. వియత్నాం యువతీయువకులు క్యూబాకు బియ్యం పంపారు. ఇప్పుడు 5,000,000 రైటింగ్ ప్యాడ్లూ, పెనాలూ పంపడానికి వాటిని సేకరిస్తున్నారు.



# రాజు - దొంగ

ప్లవంగదేశాన్ని పాలించే అనంగసేనుడు అర్ధాంతరంగా మరణించాడు. అనంగసేనుడి కంటే రెండు సంవత్సరాలు పెద్దవాడైన లవంగసేనుడు, సమయానికి అడవిలో శాంత నవుడి ఆశ్రమంలో వున్నాడు. ఆయనకు రాజ్య కాంక్ష లేకపోవడం వల్ల, చిన్నతనంలోనే తల్లిదండ్రుల అనుమతి తీసుకుని జ్ఞాన సముపార్జనకై అడవుల్లో యోగులు, జ్ఞానులు, ఋషులు వుండేచోటుకు వెళ్ళిపోయాడు.

అనంగసేనుడి మంత్రులలో పెద్దవాడైన సుషేణుడు స్వయంగా అడవికి వెళ్ళి, లవంగ సేనుడిని కలుసుకుని పరిస్థితి వివరించి, "ప్రభూ! యువరాజుకిప్పటికింకా పది సంవత్స రాల వయస్సు. మరొక పదేళ్ళు గడిస్తే తప్ప ఆయనకు సింహాసనం అధిష్ఠించే అర్హత రాదు. తమరు వచ్చి రాజ్యభారం స్వీకరించక పోతే ప్లవంగదేశం ఇక్కట్లపాలు కాగలదు," అన్నాడు.

అందుకు లవంగసేనుడు, "నాకు రాజ్య కాంక్ష లేదు. పరిపాలనాదక్షత లేదు. ఇహ సుఖాల పట్ల ఆసక్తి లేదు. నావల్ల ప్లవంగ దేశానికి ప్రయోజనముండదు. ఇక్కడ ఆశ్ర మంలో నేనెంతో సంతోషంగా వున్నాను. అదీకాక నారాక నా తమ్ముడి భార్య ఇందు మతికి ఇబ్బంది కలిగిస్తుంది. తన బిడ్డ ప్లవంగుడి భవిష్యత్తుకు నేనే అడ్డంకి అని ఆమె అనుకోవచ్చు," అని జవాబిచ్చాడు.

"అయితే, మహారాణి ఇందుమతే ఇక్కడికి వస్తారు. ఆమె స్వయంగా వచ్చి తమరిని రాజధానికి ఆహ్వానిస్తారు," అని సుషేణుడు వెళ్ళిపోయాడు.

ఇది జరిగాక లవంగసేనుడు, తన గురు వైన శాంతనవుడిని కలుసుకుని, సంగతి చెప్పి తానేం చేయాలో ఆదేశించమన్నాడు.

శాంతనవుడు కాసేపాలోచించి, "నువ్వు ఇంతకాలం యోగిలా జీవించావు. నావద్ద

జొన్నలగడ్డ రామలక్ష్మి



వున్న జ్ఞానసంపదకు నిన్నే వారసుణ్ణి చేసి హిమాలయాలకు పోదామనుకున్నాను. నేను మరికొంతకాలం వేచి వుండక తప్పదు. నువ్వు ప్లవంగ దేశానికి వెళ్ళి వీలైనంత త్వరగా అక్కడి పరిస్థితులు చక్కదిద్దు. రాజకుమారుడికి త్వరితంగా రాజ్యార్హుడయ్యే శిక్షణ ఇవ్వు. ఏది ఏమైనా రాజుగా వున్నంత కాలం రాజ్యాన్ని శ్రద్ధగా పాలించు," అని సలహా ఇచ్చాడు.

ఆ మర్నాడే రాణి ఇందుమతి ఆశ్రమానికి వచ్చి, "నా బిడ్డ క్షేమాన్నీ, నా క్షేమాన్నీ, రాజ్య క్షేమాన్నీ కాంక్షించేవాడివయితే, వెంటనే వచ్చి పరిపాలనా బాధ్యతలు స్వీకరించు," అని లవంగసేనుణ్ణి కోరింది.

లవంగసేనుడు అందుకు అంగీకరించి, శాంతనవుడి వద్ద సెలవు తీసుకుని రాజధానీ నగరానికి వెళ్ళాడు. ఆయన శాంతనవుడి మాటలు మరచిపోలేదు. వెంటనే రాజ్యపాలన మీద దృష్టిని కేంద్రీకరించాడు. అప్పుడాయనకు కోశాగారంలో డబ్బు లేదనీ, అవసరమైనప్పుడల్లా ప్రజలపై పన్నులు పెంచి కోశాగారం నింపడం జరుగుతున్నదనీ అర్థమయింది. రాజోద్యోగుల్లో అవినీతి బాగా పెరిగిపోయిందని కూడా ఆయన గ్రహించాడు.

ముందుగా లవంగసేనుడు, మంత్రులతో చర్చలు జరిపాడు. రాజైన అనంగసేనుడు వారి మాటలు లక్ష్యపెట్టకుండా, అన్నీ తనకు తోచినట్లే చేసేవాడనీ, అందువల్లనే దేశ పరిస్థితి అధ్వాన్నంగా తయారయిందనీ లవంగసేనుడు తెలుసుకున్నాడు. మంత్రుల సలహాల్లో మంచివాటిని ఏరి, ఆయన ఇందుమతితో చర్చించాడు.

ఆమె, లవంగసేనుడితో, "నా తండ్రి చిన్నతనం నుంచీ నాకు రాజనీతిలో శిక్షణ ఇచ్చాడు. దురదృష్టం కొద్దీ మీ తమ్ముడు నా సలహాలు ఏనాడూ పాటించలేదు," అని తనకు తోచిన సలహాలను లవంగసేనుడికిచ్చింది.

ఇందుమతి సలహాలు నిజంగా విజ్ఞతతో కూడినవని, లవంగసేనుడికి త్వరలో అర్థమయింది. ఆయన అందరి మాటలకూ విలువనిస్తూ, తన విచక్షణను ఉపయోగిస్తూ

రాజ్యంలో ఎన్నో సంస్కరణలు ప్రవేశపెట్టాడు. ఏడాదిలోనే అవి సత్ఫలితాలనిచ్చాయి.

లవంగసేనుడు రాజ్య వ్యవహారాలు చూస్తూనే, యువరాజు ప్లవంగుడికి రాజ నీతిలో శిక్షణ ఇవ్వసాగాడు. ప్లవంగుడు అంతా చురుకుగా ఆకళింపు చేసుకుంటున్నాడు.

ఇందుకు లవంగసేనుడెంతో సంతోషించి, ఒకనాడు ఇందుమతితో, "ప్లవంగుడికి పది హేను సంవత్సరాలు రాకుండానే రాజ్యాభిషేకం చేసి, నేను ఆశ్రమానికి తిరిగి పోవచ్చును. వాడికి నీ సమర్థత తోడయితే ప్లవంగదేశం ప్లవంగుడి పాలనలో కలకాలం వర్ధిల్లగలదు," అన్నాడు.

ఈ మాటలకు ఇందుమతి కలవరపడి, "అది సాధ్యపడే పని కాదు. మీరు వాడికి ఇరవై ఏళ్ళు నిండేవరకైనా రాజ్యపాలన చూస్తూ, ఆ తర్వాత వాడికి పట్టాభిషేకం చేయండి. అలా కానప్పుడు, రాజ్యం పరాయి రాజుల హస్తగతమవుతుంది. ఎంతో కాలంగా ఈ రాజ్యాన్నేలుతున్న, మీ రాజ వంశం అప్రతిష్ఠ పాలవుతుంది. ప్రజలు మిమ్మల్ని నిందిస్తారు," అంది కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

మరదలి కన్నీళ్ళూ, బాలుడైన తమ్ముడి కొడుకు అసహాయతా లవంగసేనుడి మన సును కలవరపరిచినై. అతడు ఇందుమతి కోరికకు అడ్డు చెప్పలేకపోయాడు. ప్రవృత్తి రీత్యా లవంగసేనుడు దయార్ద్ర హృదయుడు, నిర్వ్యసనపరుడు, సమర్థుడు.



క్రమంగా లవంగసేనుడి పాలనలో అవి నీతిపరులకు స్థానం లేకుండా పోయింది. కొందరు అవినీతిపరులకు అతడి పాలన కంటగింపుగా వున్నప్పటికీ, వాళ్ళు కుక్కిన పేనుల్లా వుండిపోయారు. ఇలా అయిదారు సంవత్సరాలు గడిచాయి.

ఒకరోజున శాంతనవుడు తన ఆశ్రమం నుంచి ప్లవంగ రాజధానికి వచ్చి, లవంగ సేనుణ్ణి కలుసుకుని, "నేను వృద్ధుడనైపోతు న్నాను. నువ్వు నావద్ద మిగిలిన జ్ఞాన సంప దను పరిగ్రహించి, ఆశ్రమానికి ప్రధానుడవైతే, నేను హిమాలయాలకు వెళ్ళగలను. నువ్వు వెంటనే బయలుదేరి నాతో ఆశ్రమానికి రావాలి," అన్నాడు.



గతించిన ఈ అయిదు సంవత్సరాల కాలంలో, లవంగసేనుడిలో రాజభోగాల పట్లా, పదవి పట్లా కొంత వ్యామోహం పుట్టింది. ఆ కారణంగా, అతడు తనకు తానై శాంతనవుడికి ఏమీ చెప్పకుండా, ముందాయనను ఇందుమతి వద్దకు తీసుకువెళ్ళాడు. ఆమె శాంతనవుడి కాళ్ళపైబడి, లవంగసేనుణ్ణి రాజ్య పాలనా బాధ్యత నుంచి తప్పించి, తిరిగి అడవిలోని ఆశ్రమానికి తీసుకు పోవద్దని భోరున ఏడ్చింది.

తర్వాత లవంగసేనుడు, ఒక పెద్ద సభను ఏర్పాటుచేసి, శాంతనవుడి ఆనతి గురించి చెప్పాడు. మంత్రులు, సామంతులు, రాజోద్యోగులు, సామాన్యపౌరులు కన్నీళ్ళతో శాంతనవుడిని, తమ రాజును తిరిగి ఆశ్రమానికి తీసుకుపోవద్దని వేడుకున్నారు.

ఇది చూసి లవంగసేనుడు చలించిపోయి శాంతనవుణ్ణి, "స్వామీ! నేను లేకుంటే రాజ్యం అరాచకమైపోతుందనీ, పాలన అస్తవ్యస్తం కాగలదనీ ప్రజలు భయపడుతున్నారు. వీరిని వదిలిరావడం న్యాయమా?" అని అడిగాడు.

శాంతనవుడు అప్పుడేమీ జవాబివ్వక, తర్వాత ఏకాంతంలో, "నువ్వు జ్ఞానివయుండీ మాయాజాలంలో చిక్కుకున్నావు. అశాశ్వతమైన దానికోసం, శాశ్వతమైనదాన్ని విడిచిపెడుతున్నావు. బాగా ఆలోచించుకో! నెల రోజులు గడువిస్తున్నాను, ఆశ్రమానికి రాదలిస్తే, ఈలోగా రా," అని చెప్పి వెళ్ళిపోయాడు.

వారం రోజులు గడిచాక దొంగ ఒకడు కోశాగారం నుంచి ధనం దొంగిలిస్తూ దొరికిపోయాడు. తీరా చూస్తే వాడు రాజు గారి మంత్రులలో ఒకడైన దీనానాధుడి కొడుకు. వాణ్ణి న్యాయస్థానానికి విచారణకు తేగానే ఎన్నో వింత విషయాలు బయటపడ్డాయి.

అప్పటికే దీనానాధుడు కోశాగారం నుంచి చాలా ధనం దొంగిలించాడు. దీనానాధుడి వద్ద చేరిన ధనంతో రాజ్యంలోని ప్రజలందరికీ ఉచితంగా తిండి పెట్టవచ్చు.

న్యాయాధికారి దీనానాధుడికీ, కొడుక్కూ మరణశిక్ష విధించాడు. అప్పుడు దీనానాధుడు కోపంగా, "న్యాయం చెప్పే అర్హత నీకెక్కడిది? ప్రతి ఏటా నీకు లక్ష వరహాలు లంచంగా

ఇస్తున్నాను. కొత్త రాజు రాగానే నువ్వు నీతిపరుడిలా నటిస్తూ, నాకు శిక్ష విధిస్తు న్నావు!" అన్నాడు.

దీనికి న్యాయాధికారి చిన్నబుచ్చుకుని, "నువ్వు నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావు. నీ మాటలకు విలువ లేదు. అయినప్పటికీ నువ్వు నామీద అభియోగం చేశావు కాబట్టి, రాజే నిన్ను విచారించి శిక్షిస్తాడు," అన్నాడు.

దీనానాథుడు పకపకా నవ్వి, "రాజు నన్నెలా శిక్షించ గలడు? కోశాగారం నుంచి డబ్బు దొంగిలించగల తెలివి నాకున్నదని తెలిసి, ఆయన నా సాయం తీసుకుంటు న్నాడు. ఆయన దయ లేనిదే, నా కొడుకు కోశాగారం చేరగలడా? మా ఇద్దరి దురదృష్టం కొద్దీ ఒక నిజాయితీపరుడైన రాజభటుడు, నా కొడుకును పట్టుకున్నాడు," అన్నాడు.

ఈ అభియోగానికి న్యాయస్థానంలోని ప్రతిఒక్కరూ నిశ్చేష్టులైపోయారు. మంత్రి సుషేణుడు ముందుగా తేరుకుని, "రాజుకు కోశాగారంలోని డబ్బు దొంగిలించాల్సిన అవసరం దేనికి?" అని ప్రశ్నించాడు.

ఇందుకు దీనానాథుడు తొణక్కుండా, "ఎవరికీ తెలియని ఈ రహస్యం చెబుతు న్నాను. లవంగసేనమహారాజుకు అడవిలో ఒక భార్య వుంది. వారికొక కొడుకున్నాడు. తన కొడుకును రాజును చేయాలని ఆయన కోరిక. ఇందుకు ఎత్తుగడ ఏమంటే — ముందుగా కొంత ధనాన్ని కూడబెట్టి, తర్వాత



సైనికుల్లో చీలికలు తెచ్చి, కొందరిని ఆ డబ్బుతో తిప్పుకుంటాడు. మరికొంత డబ్బుతో రాజుకొడుకు అడవిలో సైన్యాన్ని సమకూర్చు కుని హఠాత్తుగా తిరుగుబాటు చేస్తాడు. రాజు అతడికి సహకరించి ఇందుమతినీ, యువ రాజు ప్లవంగుడినీ హతమార్చుతాడు. ఆయన రాజు కావడం వల్ల, ఈ పథకంలో భాగ స్వామిని కావడం నాకూ తప్పలేదు," అన్నాడు.

ఈ కుట్ర విశేషం ప్లవంగ రాజ్యంలో పెద్ద సంచలనాన్ని సృష్టించింది. సామాన్య పౌరుడి నుంచి, రాణి ఇందుమతి వరకూ లవంగసేనుణ్ణి సంజాయిషీ అడిగారు. తన కేమీ తెలియదని ఆయనంటే, అట్లని ఋజువు చేసుకోమన్నారు.

చివరికొక రోజున రాణి ఇందుమతి, లవంగసేనుడితో, "నువ్వు నీ నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోలేకపోతే రాజ్యాన్ని విడిచి వెళ్ళు. అప్పుడు నీకు రాజ్యకాంక్ష లేదని నమ్ముతాను," అన్నది.

అందుకు లవంగసేనుడు వెంటనే, "ఒక్క షరతు మీదనే రాజ్యం విడిచిపెట్టి వెళ్ళిపోతాను. దీనానాధుడి కేపాపమూ తెలియదు. నేను చెప్పడం వల్లనే అతడు కోశాగారంలోకి తన కొడుకును పంపాడు. నేను చెప్పమన్న అబద్ధాలే న్యాయస్థానంలో చెప్పాడు. అతడి కేశిక్షావిధించకుండావిడిచిపెడతామని మాట ఇస్తే, నేను అడవికి వెళ్ళిపోతాను," అన్నాడు.

"దీనానాధుడి చేత నీవీ నాటకం ఆడించావా? ఎందుకు?" అని అడిగింది ఇందుమతి ఆశ్చర్యంగా.

ఆ ప్రశ్నకు లవంగసేనుడు శాంతంగా, "మీ అందరి అభిమానం అశాశ్వతమని, నా గురువు శాంతనవుడు నాతో అన్నాడు. అందులోని నిజానిజాలు తెలుసుకోవాలని, ఈ నాటకమాడాను. నేను నిజాయితీతో మీ అందరికీ ఎన్నో సేవలు చేశాను. మీరంతా సుఖపడాలని నా శక్తి కొద్దీ కృషి చేశాను. కానీ నా ప్రోత్సాహ కారణంగా — దొంగ కాని ఒక దొంగ ఆపద్ధర్మంగా తన్ను తాను రక్షించుకునేందుకు నోటికి వచ్చినట్లు మాట్లాడితే, మీరంతా వాడి మాటలకు విలువనిచ్చి నన్ను నేరస్థుణ్ణి చేశారు. వాడితో నన్ను సమం చేసి, నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోమన్నారు. 'లవంగసేనుడలాంటి వాడు కాదు. దీనానాధుడు దొంగ. దొంగ మాటలు నమ్మి దేవుడి వంటి రాజును అనుమానించకూడదు. దీనానాధుడిని తన ఆరోపణలన్నీ ఋజువు చేయమనండి!' అని మీలో ఏ ఒక్కరైనా అనివుంటే, నేను సంతోషించేవాడిని. ఏ దేశంలో అయితే రాజు – దొంగ సమంగా గౌరవించబడతారో, ఆ దేశంలో రాజులో కానీ, ప్రజల్లో కానీ లోపముంటుంది. నాకు లభించే అభిమానం, గౌరవం అశాశ్వతమని తెలిసీ శాశ్వతమైన జ్ఞానానికి నేనిక దూరం కాలేను," అని వారికి చెప్పి రాజ్యాన్ని విడిచి శాంతనవుడిఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# విచిత్ర పుష్పం

## 6

[మాణిక్యపురి రాజ్యాన్ని రాకాసి మృగం బారి నుంచి కాపాడడానికి, ప్రతాపవర్మ కొండజాతి యువకుల సాయం కోసం శృంగ్మాయ్ కొండలకు వెళ్ళాడు. యువరాణితోపాటు వచ్చిన రాజును చూసి అక్కడి ప్రజలూ, వాళ్ళనాయకుడు కుంభుడూ అమితానందం చెందారు. ఉత్తుంగుడు రాజు ఆనతి నెరవేర్చగలనని ఆయనకు మాట ఇచ్చాడు. యువరాణి శతాబ్దిక పుష్పాలను చూసి వచ్చింది. రాజు సంతోషంగా రాజధానికి వెనుదిరిగాడు. — తరవాత]

రాజు ప్రతాపవర్మ యువరాణితో కలిసి తమ నివాస స్థలానికి రావడం తలుచుకుని ఉత్తుంగ జాతి ప్రజలు ఆనందంతో ఉప్పొంగి పోయారు. రాజు తమ సహాయాన్ని కోరడం, రాజ్యానికి వచ్చిన ఆపదను అడ్డుకోవడానికి తమ జాతి యువకుడు ఉత్తుంగుడు వెళతా ననడం వాళ్ళకెంతో ఆనందం కలిగించింది. తన ప్రయత్నంలో ఉత్తుంగుడు విజయం సాధించాలని అక్కడి ప్రజలు తమ కుల దేవతకు మొక్కుకున్నారు. ఆ యువకుడి గౌరవార్థం ఆరోజు సాయంకాలం విందు ఏర్పాటు చేశారు.

పెద్దలూ, పిన్నలూ గూడానికి సమీపంలో ఉన్న ఒక విశాల ప్రదేశంలో గుమికూడారు. వాళ్ళ నాయకుడు కుంభుడూ, ఇతర కుల పెద్దలూ కూర్చున్న స్థలానికి పక్కనే ఉత్తుంగుడికి ఉన్నత ఆసనం వేశారు. విందు ఆరగిస్తూ కులపెద్దలు, ఉత్తుంగుడు రాకాసి



మృగాన్ని ఎలా ఎదుర్కుంటే అతని పని సులభమవుతుందో దీర్ఘంగా ఆలోచించి చర్చించారు.

విందూ,వాళ్ళ చర్చలూ అయ్యాక, నాయకుడు శుంభుడు లేచి నిలబడి, "శతాబ్దిక పుష్పాలు పూచివున్న స్థలం మన ఉత్తుంగుడికి తెలుసు. కాబట్టి, రేపు తెల్లవారగానే అతనితో పాటు ఆరుగురు యువకులు వెళ్ళి ఆ పూలను సేకరించాలి. రాత్రివేళ రాకాసి మృగం వచ్చే అపాయం ఉన్నది గనక, పొద్దుగూకేలోగా ఆ పని పూర్తి చేయాలి. కోసిన పువ్వులను కట్టలుగా కట్టి ఒకచోట భద్రపరచి రాత్రికి గూడెం చేరుకోవాలి," అనికొంతసేపు ఆగి, "ఆ పుష్పాలను సముద్ర మధ్యానికి చేర్చాలంటే ఒక పడవ కావాలి. సముద్ర తీర ప్రాంతం నాశనమైపోయింది గనక, అక్కడ పడవలు లభించే అవకాశం లేదు. కాబట్టి, మనమే ఇక్కడొక పడవను తయారుచేసుకోవాలి. మీలో ఎవరికైనా పడవ తయారుచేయటం వచ్చా?" అని అడిగాడు.

జనం మధ్య నుంచి ఇద్దరు ముందుకు వచ్చి, "మేము కొన్నాళ్ళు సముద్ర తీర గ్రామాలలో వుండి వచ్చాము. అప్పుడు మేము పడవను తయారుచేసే పద్ధతి నేర్చుకున్నాము. మేము పడవను తయారు చేయగలం," అన్నారు.

"ఎన్ని రోజులలో సిద్ధం చేయగలరు?" అని అడిగాడు నాయకుడు.

"రెండు రోజులలో సిద్ధం చేయగలం, ప్రభూ!" అన్నారు వాళ్ళు.

"చాలా సంతోషం!" అని నాయకుడు జనం కేసి చూస్తూ, "మరి, రేపు పొద్దున ఉత్తుంగుడితో పాటు, పువ్వులు సేకరించడానికి ఎవరు వెళతారు?" అని అడిగాడు.

వెంటనే, నేనంటే నేను అంటూ యువకులందరూ చేతులెత్తారు.

"మీ ఉత్సాహానికి సంతోషం! అయినా, ఇంతమంది అవసరం లేదు. ఆరుగురు వస్తే చాలు," అంటూ ఉత్తుంగుడు అక్కడి వారిలో ఆరుగురిని ఏరి పక్కకు పిలిచాడు.

ఆ తరవాత ఉత్తుంగుడు, నాయకుడితో సహా అక్కడ చేరిన పెద్దలకు చేతులెత్తి

నమస్కరించి, వారి ఆశీస్సులు పొందాడు. నాయకుడుశుంభుడుఆప్యాయంగా ఉత్తుంగుడి భుజాన్ని తట్టాడు. ఉత్తుంగుడు నవ్వుతూ, చెల్లెలు రజనిని తీసుకుని తమ గుడిసెకు చేరుకున్నాడు.

మరునాడు తెల్లవారుజామునే ఉత్తుంగుడు ఆరుగురు మిత్రులను వెంటబెట్టుకుని, శతాబ్దిక పుష్పాలు పూచి వున్న కొండలకేసి బయలుదేరాడు. బారెడు పొద్దెక్కేసరికి వాళ్ళు ఆ చెట్లున్న కొండలను చేరి, పూలున్న చెట్లను గొడ్డళ్ళతో మొదలంట నరికి పడగొట్టారు. కిందపడిన ఒక్కొక్క చెట్టు చిటారు కొమ్మలలోని పువ్వులనూ కోసి కట్టలు కట్టలుగా కట్టసాగారు. సాయంకాలానికి పూలన్నిటినీ కోసి కట్టలు కట్టారు. ఉత్తుంగుడు అక్కడ కనిపించిన రెండు లేత మొక్కలను పెరికి, పూల కట్టలతో కట్టి, ఆ కట్టలను ఒక పెద్ద బండ రాయి వెనక భద్రపరచాడు. సూర్యుడు అస్తమిస్తూండగా ఏడుగురు మిత్రులూ సంతోషంగా గూడానికి వెనుదిరిగారు.

వాళ్ళు గూడాన్ని సమీపిస్తుండగా నాయకుడు ఎదురుపడి, "మీరు వెళ్ళిన పని పూర్తయింది కదా?" అని అడిగాడు.

"అయింది," అన్నాడు ఉత్తుంగుడు నవ్వుతూ.

"రేపు సాయంకాలానికి పడవ సిద్ధమవుతుంది. ఎల్లుండి, తెల్లవారుజామున మనం సముద్రతీరానికి బయలుదేరవచ్చు," అన్నాడు నాయకుడు పక్కన ఉన్న పడవను వాళ్ళకు చూపుతూ.





అతరవాత ఆయన ఉత్తుంగుడితో, "మీరు బాగా అలిసిపోయి వచ్చారు. వెళ్ళి నిద్రపొండి. నేను ఈ రాత్రికి వేరే కొందరిని గూడానికి కాపలా ఉంచుతాను," అన్నాడు.

ఉత్తుంగుడు సరేనని మిత్రులతో కలిసి వెళ్ళిపోయాడు.

అర్ధరాత్రి వరకు నాయకుడు కూడా కాపలా కాస్తున్న వాళ్ళతో కలిసి తిరిగాడు. ఆ తర వాత మిగతావాళ్ళు మరీమరీ చెప్పడంతో ఆయన ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

తెల్లవారగానే కాపలాఉన్నవాళ్ళు వచ్చి నాయకుడితో, "రాత్రి ఇటువైపు రాకాసి మృగం రాలేదు. కాని, ఎక్కడో చెట్లు కూలడం, బండరాళ్ళు దొర్లడం వంటి విచిత్ర ధ్వనులు దూరం నుంచి వినిపించాయి. నాలుగో జాము నుంచి ఆ ధ్వనులు కూడా క్రమంగా ఆగి పోయాయి," అని చెప్పారు.

"అలాగా! సరే, మీరు వెళ్ళండి," అన్నాడు నాయకుడు.

మరునాడు ఉదయం ఉత్తుంగుడు, నాయకుడి ఆజ్ఞ ప్రకారం మిత్రులతో కలిసి వెళ్ళి, మొదటి రోజు కోసి, కట్టలు కట్టి ఉంచిన శతాబ్దిక పుష్పాలను తీసుకువచ్చాడు. వాళ్ళు వచ్చేసరికి పడవ దగ్గర వాళ్ళ నాయకుడూ, ఉత్తుంగుడి చెల్లెలు రజనీ ఉన్నారు. పడవ సిద్ధంగా ఉన్నది. నాయకుడు ఆ పువ్వులను ఆశ్చర్యంతో కొంతసేపు పరీక్షగా చూశాడు. వాటి పరిమళం అక్కడి వారందరినీ ముగ్ధుల్ని చేసింది.

మరునాడు వేకువజామున నాయకుడూ, ఉత్తుంగుడూ తమ పరివారంతో బయలు దేరారు. నాయకుడు ముందూ, ఆయన వెనక ఉత్తుంగుడూ అతని చెల్లెలూ, వాళ్ళ వెనక పడవను భుజాలపై మోస్తూ నలుగురు దృఢకాయులూ దక్షిణ సముద్రం కేసి నడక సాగించారు.

గూడెం ప్రజలు పలువురు, కొంతదూరం వాళ్ళ వెనకగా వచ్చి వాళ్ళను సాగనంపారు.

పొద్దుగూకేలోగా సముద్రతీరం చేరుకోవా లన్న పట్టుదలతో వాళ్ళు వేగంగా నడిచి మధ్యాహ్నానికి సగం దూరం చేరుకుని, ఒక వటవృక్షం కింద కొంతసేపు విశ్రాంతి తీసు



కున్నారు. ఆ తరవాత బయలుదేరి సూర్యాస్త మయానికి ముందే సముద్రతీరం చేరారు. పడవను మోసుకొచ్చిన వాళ్ళు దానిని సముద్ర జలం దగ్గర దించారు. మిగతావాళ్ళు కట్టలు కట్టిన పువ్వులను పడవలో వేశారు. పువ్వుల నుంచి కమ్మని పరిమళం వీచింది. ఉత్తుం గుడు నాయకుడి పాదాలకు నమస్కరించాడు. నాయకుడు అతన్ని ఆప్యాయంగా లేవనెత్తి, "నీకు తప్పక విజయం సిద్ధిస్తుంది. మన కులదేవత కరుణతో నువ్వు త్వరగా జయ ప్రదంగా తిరిగి రాగలవు," అని ఆశీర్వ దించాడు.

పక్కనే వున్న రజని, "నువ్వు, త్వరగా రావాలి అన్నయ్యా! నీకోసం ఎదురుచూస్తూం టాము," అంటూ అన్నం మూటను ఉత్తుంగు డికి అందించి, "ఇది, మార్గమధ్యంలో ఆకలి వేస్తే తినడానికి," అన్నది.

ఉత్తుంగుడు దానిని నవ్వుతూ అందుకుని, "నీకు ఎటువంటి కొరతా లేకుండా యువరాణి చూసుకుంటుంది. నేను త్వరలో తిరిగి వస్తాను. ఆ మాట యువరాణితో చెప్పు," అని మిత్రులకేసి ఒకసారి నవ్వుతూ చూసి, పడవ లోకి ఎక్కి తెడ్డును అందుకున్నాడు.

మిత్రులు పడవను నీళ్ళలోకి నెట్టారు. పడవ అలల మీద కిందికీ పైకీ లేస్తూ ముం దుకు సాగింది. గట్టున ఉన్న వాళ్ళందరూ నవ్వుతూ చేతులెత్తి ఉత్తుంగుడికి వీడ్కోలు పలికారు. పడవ మరింత వేగంగా ముందుకు దూసుకుపోసాగింది.

పడవ కనుమరుగయ్యేంత వరకు అక్కడే నిలబడి దానికేసి చూస్తూ ఉండి, నాయకుడు వెనుదిరగగానే మిగతావాళ్ళు కూడా ఆయనను అనుసరించారు. నాయకుడు రజని భుజాన్ని ఓదార్పుగా తాకాడు. అందరూ మౌనంగా రాజధానీ నగరం కేసి నడవసాగారు.

దారిలో వాళ్ళకు నేలమట్టమైపోయిన చెట్లూ, నాశనమైపోయిన ప్రదేశాలూ కనిపిం చాయి. అంతటి భీకర పరిస్థితిని కేవలం మానవమాత్రులు కల్పించడం సాధ్యం కాదనీ, అతీతమైన బలం గల రాకాసిమృగం కారణం గానే అలా జరిగి ఉంటుందనీ వాళ్ళు అను కుంటూ ముందుకు నడిచారు. రాత్రయ్యేకొద్దీ రాకాసిమృగం సముద్రం నుంచి వెలుపలికి

వచ్చే అపాయం వుంది కాబట్టి, ఆ ప్రాంతం నుంచి తప్పించుకోవడం మంచిదని వేగంగా నడవసాగారు. కొంతదూరం వెళ్ళాక దట్టమైన అడవి ఎదురయింది. ఆకాశం మేఘాలు కమ్ముకుని చీకటిగా ఉండడంతో వాళ్ళు ఇక ముందుకు వెళ్ళలేక ఒక చోట ఆగి, రాత్రంతా అక్కడే గడిపారు.

తూరుపు దిక్కున వెలుతురు కనిపించగానే, వాళ్ళు బయలుదేరి మధ్యాన్నానికి రాజధానీ నగరం చేరారు. రాజప్రాసాదం చేరి కాపలా భటులకు తమ రాకను తెలియజేశారు. రాజప్రాసాదం లోపల సేనాధిపతి గంభీర వర్మతో చర్చ జరుపుతున్న రాజు ప్రతాపవర్మ, వాళ్ళు వచ్చిన వార్త వినగానే సేనాధిపతితో సహా ఎదురువచ్చి, సాదరంగా ఆహ్వానించాడు.

"మాణిక్యపురిని ఆపద నుంచి రక్షించ డానికి మీరందరూ చూపుతున్న శ్రద్ధ మరువ రానిది. ప్రజలు మీ త్యాగనిరతిని కలకాలం గుర్తుంచుకుంటారు," అన్నాడు రాజు.

"మా బాధ్యతను నేరవేర్చడానికి ఒక అవ కాశం కలిగినందుకు మాకెంతో సంతోషంగా ఉన్నది, మహారాజా! నిన్న సాయంకాలమే ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలను తీసుకుని రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ సముద్రంలోకి వెళ్ళాడు," అన్నాడు కొండజాతి నాయకుడు శుంభుడు.

"అలాగా! అప్పుడేనా! చాలా సంతోషం!" అంటూ రాజు రజనికేసి తిరిగి, "రజనీ, ఇలా రా," అన్నాడు.

అంతలో, రజని రాక తెలిసి అక్కడికి వచ్చిన యువరాణి ప్రియంవద నవ్వుతూ రజని దగ్గరికి వెళ్ళి, "ఈ క్షణం నుంచి మన మిద్దరం స్నేహితులం!" అంటూ ఆమె భుజం మీద చేయివేసి, ఆమెను తన అంతఃపుర భవనం కేసి నడిపించింది.

"మా అన్నయ్య పడవ ఎక్కి బయలు దేరేప్పుడు, త్వరలో రాగలనని నీతో చెప్పమని చెప్పి వెళ్ళాడు," అన్నది రజని.

"అలాగా! చాలా సంతోషం! మీ అన్నయ్య విజయం సాధించి త్వరలో తిరిగి రాగలడన్న నమ్మకం నాకున్నది," అన్నది యువరాణి చిన్నగా నవ్వుతూ. — (ఇంకావుంది)



# వేదాంతిభార్య

విద్యాపురంలో శ్వేతాంబరుడనే ఒక గొప్ప వేదాంతి వుండేవాడు. ఆయన వేదాంతపరమైన ఎన్నో జటిల సమస్యల గురించి గొప్ప గ్రంథం రాసి కాలధర్మం చెందాడు. అందులోని విషయాలు చాలా వరకు గొప్ప పండితులక్కూడా అర్థం కాలేదు.

ఆ గ్రంథం మీద వ్యాఖ్యానం రాస్తున్న శంకరశాస్త్రి అనే ఆయనకు ఎన్నో సందేహాలు కలగ సాగాయి. వాటికి సంతృప్తికరమైన సమాధానాలు ఎవ్వరూ చెప్పలేకపోతున్నారు.

ఒకనాడు శంకరశాస్త్రి భార్య, భర్తతో, "శ్వేతాంబర వేదాంతి భార్య బతికే వున్నది కదా! ఆమెపై భర్త గారి వేదాంత ప్రభావం అంతో, ఇంతో తప్పక వుండి తీరుతుంది. మీరామె నడిగి, మీ సందేహాలు తీర్చుకోండి," అన్నది.

శంకరశాస్త్రి, శ్వేతాంబర వేదాంతి ఇంటికి వెళ్ళి, ఆయన భార్యను, "అమ్మా! మీ భర్త రాసిన వేదాంత గ్రంథంలోని విషయాలు, మీరు చక్కగా అర్థం చేసుకుని వుంటారు. నా సందేహాలు తీరుస్తారా?" అని అడిగాడు.

దానికి శ్వేతాంబరుడి భార్య మందహాసం చేసి, "నాయనా! నేను దాంపత్యజీవితమంతా, నా భర్తకు సేవచేస్తూ, ఆయనను అర్థం చేసుకునే ప్రయత్నంలోనే గడిపేశాను. అలాంటి నాకు, ఆయన రాసిన వేదాంత గ్రంథాన్ని అర్థం చేసుకునే తీరికా, అవకాశం ఎక్కడిది?" అన్నది.

ఈ జవాబు విని, మారుపలకలేకపోయాడు శంకరశాస్త్రి. — యస్.లోకేశ్వరి






# సంజీవుడి చమత్కారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతి గొలిపే ఈ శ్మశానంలో, నువ్వు పట్టిన ఏదైనా దీక్షా, ప్రతిజ్ఞా నిలబెట్టుకునేందుకు ఇలా శ్రమపడుతున్నావేమో నాకు తెలియదు. కాని, కొన్ని పరిస్థితులలో అలాంటి వాటిని నిలబెట్టుకోవడం అసాధ్యమవుతుంది. సంజీవుడనే కవి డబ్బుకోసం అతిసామాన్యుల మీద చమత్కారంగా గొప్పవాడంటూ కవిత్వం చెప్పి డబ్బు సంపాయించుకునేవాడు. అయితే, నిజమైన గొప్పవారి గురించి మాత్రం కవిత్వం రాసే అర్హత తనకు లేదనీ, రాయననీ దీక్ష పట్టినవాడిలా మాట్లాడేవాడు. కాని, పరిస్థితుల ప్రభావం వల్ల, అందరూ గొప్పవాడనుకునే

## బేతాళ కథలు



ఒక రాజు మీద అతడు కావ్యం రాసి డబ్బు సంపాయించుకున్నాడు. నేనతడి కథ చెబు తాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు కుందనదేశాన్ని రవి చంద్రుడనే రాజు పాలించేవాడు. ఆయన ఎక్కడకు వెళ్ళినా రాజునన్న అహంభావం లేకుండా, సామాన్యులలో సామాన్యుడుగా కలిసిపోయేవాడు. ఆయనకు తనను ఎవ రెంత మాటన్నా కోపం వచ్చేదికాదు. భూలో కంలో అంతటి శాంతస్వభావుడు లేడని పేరు!

కుందనదేశంలోనే సంజీవుడనే కవి వున్నాడు. చమత్కారాని కతడు పెట్టింది పేరు. ఎంత గొప్పవారినైనా అతడు తన చమత్కార కవిత్వంతో నవ్వులపాలు చేసే వాడు. అతడి కవిత్వం వినాలని చాలా మంది కుతూహలపడేవారు.

ఒకసారి రాజాస్థాన కవి అయిన శ్వేత కేతుడు, అనుకోకుండా సంజీవుడుండే గ్రామానికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు కులదీపుడనే భాగ్యవంతుడు ఆతిథ్యం ఇచ్చాడు. మాటల సందర్భంలో కుల దీపుడు, సంజీవుడి కవిత్వాన్ని తెగ మెచ్చు కున్నాడు. శ్వేతకేతుడు సంజీవుడింటికి వెళ్ళి, తనను తాను పరిచయం చేసుకుని కవిత్వం వినిపించమని కోరాడు.

సంజీవుడు నవ్వి, "కులదీపుడి మాటలు విని మీరు మోసపోకండి. ఆయనకు ఆగర్భశత్రువైన మణికంఠుడి మీద, నేను చమత్కారంగా కొన్ని పద్యాలు చెప్పాను. అవి చదివి అందరూ మణికంఠుణ్ణి వేళా కోళం చేస్తూంటారు. అందువల్ల, కుల దీపుడికి నేనంటే అభిమానం ఏర్పడింది. ఆయన మీదా నాలుగు పద్యాలు చెప్పేదాకే వుంటుందా అభిమానం!" అన్నాడు.

దీనికి శ్వేతకేతుడు కూడా నవ్వి, "మీకు కులదీపుడంటే అభిమానమే! ఆయన మీద మీరు చెప్పిన పద్యాలు చదివాను. మీరా యననెంతో చక్కగా పొగిడారు," అన్నాడు.

"ఆ పద్యాలు చదివి కులదీపుడు గొప్ప వాడనుకోకూడదు. నాకు నాలుగు డబ్బుల

వసరమయ్యాయి. ఉత్తినే ఎవడు సాయం చేస్తాడు? అలాంటప్పుడిలా పద్యాలు రాసి డబ్బు సంపాదించుకుంటాను. డబ్బిచ్చి తన మీద పద్యాలు రాయించుకునేవాడు గొప్పవాడు కాదు!" అన్నాడు సంజీవుడు.

"కానీ మీరు కులదీపుడి మీద చెప్పిన పద్యాలు అద్భుతం, అనన్యసామాన్యం. ఇలాంటి పద్యాలు మీరు మన రాజైన రవి చంద్రుడి మీద చెప్పగలిగితే, తరతరాలకూ తరగని ఆస్తి సంపాయించు కోవచ్చు," అన్నాడు శ్వేతకేతుడు.

ఇందుకు సంజీవుడు అయిష్టంగా, "అయ్యా! డబ్బు కోసం అడ్డమైన వాళ్ళనూ పొగిడే నేను, రవిచంద్రుడి వంటి గొప్ప రాజు మీద పద్యాలు చెప్పడం, ఆయనకు అవమానం, నన్నిలాగే వుండనివ్వండి," అన్నాడు.

శ్వేతకేతుడు అప్పటికింకేమీ మాట్లాడక, రాజధానికి వెళ్ళిన తర్వాత రాజు రవి చంద్రుడికి సంజీవుడి గురించి చెప్పి, "ప్రభూ! ఇంతకాలం నేను చాలా గొప్ప కవి నన్న అహంభావం వుంటే, అది సంజీవుణ్ణి చూశాక పోయింది. డబ్బు కోసం అనర్హు లను పొగుడుతున్నప్పటికీ, అతడికి డబ్బాశ లేదు. ఎందుకంటే, తన చమత్కారంతో ఎందరో భాగ్యవంతుల మనస్సు నొప్పిం చాడు. డబ్బాశ వున్న వాడలాంటి పని చేయ లేడు," అంటూ సంజీవుడి చమత్కారం



గురించిన కొన్ని అద్భుతమైన విశేషాలు చెప్పాడు.

రవిచంద్రుడు చమత్కార ప్రియుడు. ఆయన వెంటనే సంజీవుడికి కబురుపెట్టి, తన వద్దకు రప్పించుకుని, "కొంత కాలం నా ఆస్థానంలో వుండి నా కోరిక తీర్చు. నీకు నచ్చితే నా ఆస్థానకవిగా వుండవచ్చు. లేదా నీ గ్రామానికి తిరిగివెళ్ళి జీవితాంతం భుక్తికి లోటు లేకుండా జీవించ వచ్చు," అని చెప్పాడు.

సంజీవుడు క్షణం ఆలోచించి, " ప్రభూ! మీరెవరిపై కోరితే వారిపై కవిత్వం చెప్ప గలను. కానీ ముందుగా మీకు వినిపించి అటుపైనే సభలో వినిపించగలను," అన్నాడు.



"అలావద్దు. సభికులతో పాటు మొదటి సారివినడంలోనే, నాకు ఆనందం",అన్నాడు రవిచంద్రుడు. ఇందుకు సంజీవుడంగీక రించక పోగా, చివరకు రాజు సరే నన్నాడు.

అప్పుడు సంజీవుడు, రాజుతో ఇలా అన్నాడు: "ప్రభూ! నేను మీ వంటవాడికి వంటవాడిని చూశాను. నా కెంతో ఆశ్చర్యం కలిగింది. వంటవాడి వంటలు రుచి ఎక్కు వగా వుండడం వల్ల, రాజు వంటవాడికి మిగల్చకుండా వండినదంతా తినేస్తున్నాడా అనిపించింది. విషయమేమిటని వాణ్ణి అడి గాను. దానికి వాడిలాగన్నాడు: రాచకార్యా ల్లోనిమగ్నుడైవుండే రాజుకు తిండి దృష్టి వుండదు. రుచి పట్టింపు వుండదు. ఆ కారణం వల్ల, వంటవాడెలా వండినా ఆయన తినేస్తాడు. అందుకని వంటవాడు తను రుచిగా తినాలని వేరే వంట వాణ్ణి పెట్టుకున్నాడు."

ఇది వింటూనే రాజు పడి పడి నవ్వి, సంజీవుణ్ణి మెచ్చుకున్నాడు. తర్వాత సభలో కూడా సంజీవుడి చమత్కారాన్నందరూ మెచ్చుకున్నారు.

ఈ విధంగా సంజీవుడు సభ జరిగినప్పు డల్లా ఒకరిపై చమత్కరిస్తూండేవాడు. అతడి చమత్కారాలు వినడం కోసం సభకు వచ్చేవారి సంఖ్య పెరిగింది.

రవిచంద్రుడికి నలుగురు మంత్రులు న్నారు. వాళ్ళు రాజుకు చాలా నమ్మకస్తులు. ముఖ్య విషయాల్లో వారిని సంప్రతించ కుండా ఆయన ఏపనీ చెయ్యడు.

ఆ నలుగురిలోనూ ముఖ్యుడు వీర వరుడు. ఆయన తలుచుకుంటే రాజును దేనికైనా ఒప్పించగలడని అంతా చెప్పు కుంటారు. సంజీవుడు ఒక రోజున వీర వరుడి మీద చమత్కార కథ అల్లాడు.

ఆ కథ ప్రకారం ఒకసారి రాజుకు ఏ మాత్రం ఇష్టంలేని పనికి వీరవరుడు, ఆయనను ఒప్పించాడు. అందువల్ల తర్వాత రాజుకు చెప్పలేనంత మేలు జరిగింది. రాజెంతో సంతోషించి ఆయనకు రత్నకంక ణాన్ని బహూకరిస్తే, వీరవరుడు అది తనకు వద్దనీ, అంతకంటే చిన్నదైన రత్నకంకణా

న్నిమ్మనీ కోరాడు. ఎవరైనా ఇంకా పెద్దది కావాలంటారు. నువ్వు చిన్నదడుగుతున్నా వేమిటని, రాజు ఆశ్చర్యపడ్డాడు. పెద్దదైతే తన భార్య చేతికి వదులవుతుందన్నాడు మంత్రి.

"నీ భార్యకు నువ్వు వేరే రత్నకంకణం చేయించలేవా? నీకు నేను కానుకగా ఇస్తు న్నది చిన్నది చేయించమనడం బుద్ధిహీనత కాదా?" అన్నాడు రాజు.

"ప్రభూ! తమదయవున్నంత కాలం, నా భార్యకు ఎన్ని రత్నకంకణాలైనా చేయించ గలను. కానీ తమరిస్తున్న ఈ కానుక నాకు కాదు, ఆమెకే! ఆమె ఒప్పుకుని వుండక పోతే, నేను తమకా సలహా ఇవ్వగలిగే వాణ్ణి కాదు," అన్నాడు వీరవరుడు వినయంగా.

వీరవరుడు, భార్య మాట జవదాటడని అంతా చెప్పుకుంటారు. అందువల్ల సంజీ వుడు చెప్పింది విని రాజు పొట్టచెక్కల య్యేలా నవ్వుకున్నాడు.

రవిచంద్రుడి రెండో మంత్రి సుబుద్ధి అధీనంలో సైన్యం, సైన్యాధిపతి వుంటారు. వాళ్ళు ఆయన చెప్పినట్లు మసులుకోవాలి. అయితే, సుబుద్ధి సన్నగా, బక్కపలచగా వుంటాడు. అందుకని సంజీవుడు, సుబుద్ధి గురించి చమత్కరిస్తూ, "రాజుగారెంత మంచివారు. బలహీనులనెలా రక్షించాలో ఆయనకు తెలుసు! సుబుద్ధి రక్షణకాయన మంచి ఏర్పాటే చేశారు!" అన్నాడు.

రాజు దీనినీ గొప్పగా మెచ్చుకున్నాడు. మూడో మంత్రి శిశుపాలుడు సున్నిత మన





పట్టి ఏడుస్తున్న శిశుపాలుణ్ణి సముదా యించే భార్యను తలచుకుంటేనే నాకు నవ్వాగడం లేదు. ఇలాంటి ఊహలు నీ కెలావస్తాయి?" అని అడిగాడు.

సభలో కూడా ఈ చమత్కారం అందరి మన్ననలనూ పొందింది.

నాలుగో మంత్రి నవనీతుడు వయసులో బాగా చిన్నవాడు. రాజుకు అతడి అవసరం లేదనీ, కేవలం అభిమానం కొద్దీ మంత్రిని చేశాడనీ అంతా చెప్పుకుంటారు.

నవనీతుడు చిన్న రాజోద్యోగిగా వున్న ప్పుడు, ఒకసారి వనవిహారంలో ఏమరు పాటున వున్న రాజును నాగుపాము కాటు వేయబోతూండగా, నవనీతుడుదాన్ని పక్కకు తోశాడు. అప్పుడు నాగుపాము నవనీతుణ్ణి కాటేసింది. రాజ వైద్యులు అతణ్ణి కాపా డారు. రాజు, నవనీతుణ్ణి ఏమైనా కోరుకో మంటే మంత్రిపదవి కావాలన్నాడు. అప్ప టికే సమర్థులైన మంత్రులు ముగ్గురు న్నారు. అయినప్పటికీ రాజు ప్రాణదాతను మన్నించాడు.

ఇది దృష్టిలో వుంచుకుని సంజీవుడు, నవనీతుణ్ణి గురించి ఒక చమత్కారం చెప్పాడు. అదేమిటంటే — అతడొకసారి ఎవరితోనో వైకుంఠపాళి ఆడుతూ పావు పాము తోక దగ్గరకు రాగానే, దాన్ని అలాగే పైకి తీసుకుని వెళ్లి తనవద్ద పెట్టు కున్నాడు.

న్కుడు. జాలి కలిగించే చిన్న దృశ్యం చూస్తేచాలు, ఆయనకు కళ్ళనీళ్ళు తిరుగు తాయి. శిశుపాలుడికి పిల్లలు లేరు. పిల్లల కోసం ఆయన ఎన్నో పూజలూ, వ్రతాలూ చేస్తున్నాడు.

సంజీవుడు, శిశుపాలుడి గురించి చమ త్కరిస్తూ, "ఒకసారి నేను శిశుపాలుడింటికి వెళితే, ఆయన గుక్కపట్టి ఏడుస్తున్నాడు. నన్ను చూసి ఆయన భార్య, మీరేమీ కంగారు పడవద్దు. పిల్లలులేని లోటు నాకా యన రకరకాలుగా తీరుస్తూంటారు. ఇదీ ఒక పద్ధతి అన్నది," అని చెప్పాడు.

రాజు రవిచంద్రుడు ఇది విని చాలా సేపు ఆగకుండా నవ్వి, "సంజీవా! గుక్క

అప్పుడు అతడి ప్రత్యర్థి, "నాయనా! అది నిచ్చెనకాదు, పాము!" అన్నాడు.

"నాకు పాములే నిచ్చెనలు!" అన్నాడు నవనీతుడు.

ఇది వింటూనే రాజు ముఖం ఎర్రగా అయింది. ఆయన అసంతృప్తిగా ముఖం పెట్టి, "ఇంతకాలం నీవి ఎంతో ఉన్నతా దర్శాలనుకున్నాను. నీ చమత్కారం గొప్ప దనుకున్నాను. కానీ నువ్వు గిట్టని వారిని అవమానపరచడం కోసం ఎంతటి నీచస్థా యికైనా దిగజారతావని ఇప్పుడే అర్థమ యింది. నవనీతుడిలో ఎటువంటి సామ ర్థ్యమూ లేదనీ, ఆశ్రయం వల్లనే పైకి వచ్చా డనీ నువ్వు భావిస్తే, అది నిజం కాదు. అతడి సలహాలవల్ల, మంత్రాంగం వల్ల నేను ఎన్నో సార్లు ప్రయోజనం పొందాను. కావాలంటే కొన్ని ఉదాహరణలు కూడా ఇవ్వగలను," అన్నాడు.

సంజీవుడు రాజలా అనడం విని ఆశ్చర్య పడ్డాడు. అతడు నెమ్మదిమీద తనను తాను తమాయించుకుని, "ప్రభూ! నేనిది సభలో చెప్పవచ్చునా?" అని అడిగాడు.

రవిచంద్రుడు ఏవగింపుగా, "ఇలాంటి అల్పబుద్ధిని సభలో ప్రదర్శించడానికి అను మతిస్తే, నీకు చెడ్డపేరు వస్తుంది. నవ నీతుడు నొచ్చుకుంటాడు. కానీ ఏకారణం వల్లనో నవనీతుడి విషయంలో నీబుద్ధి వక్రించింది. అతణ్ణి గురించి మరొక విశే



షంతో ఇంకేదైనా చమత్కారం చెప్పు!" అన్నాడు.

సంజీవుడు వినయంగా, "ప్రభూ! ఒక సారి అల్పబుద్ధి ప్రకటించాక, నేనిక తమ ముందు చమత్కారాలు చెప్పలేను. తమర నుమతిస్తే, తముపై ఒక కావ్యం రాసి, అటు పైన స్వగ్రామానికి తిరిగి వెళ్ళిపోవాలని వుంది," అన్నాడు.

రాజు ఎంత చెప్పినా సంజీవుడు వినలేదు. చివరికతడు రవిచంద్ర విలాసమనే కావ్యం రాసి, రాజు ఇచ్చిన అంతులేని కానుకలతో తన గ్రామానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సంజీ వుడు, రాజు మెచ్చినంతకాలం ఇతరులను

తన చమత్కారంతో అంతో ఇంతో చికాకు పెట్టాడు. అయితే, రాజు ఒక్కసారి అతణ్ణి అల్పబుద్ధి అనగానే చమత్కారాన్నే విడిచి పెట్టాడు. మొదట్లో రాజాస్థానకవి శ్వేత కేతుడు రాజు మీద కావ్యం రాయమంటే, రాయనన్నాడు. తర్వాత తనకుతానై కావ్యం రాశాడు. ఇందుకు కారణం రాజుకు తన మీద కోపం వచ్చిందన్న భయమా, లేక డబ్బుపై గల ఆశా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సంజీవుడికి తనకు తోచిన విధంగా చమత్కారాలు చెప్పడం అలవాటు. రాజు అతణ్ణి ఆస్థానానికి ఆహ్వానించి, సభలో చమత్కారాలు చెప్పమన్నప్పుడు, ఆయన ఇచ్చిన స్వతంత్రాన్ని దురుపయోగం చేయకూడదనే, ముందుగా తాను చెప్పబోయే చమత్కారాన్ని రాజుకు వినిపిస్తూ వచ్చాడు. అయితే, రాజుకు నవనీతుడిపై ప్రాణదాత అన్న అభిమానం కొద్దీ, సంజీవుడు అతడిపై చెప్పిన చమత్కారాన్నిమెచ్చకపోగా,సంజీవుణ్ణి అల్పబుద్ధి అంటూ నిందించాడు. రాజ్యంలో అందరూ అనుకుంటూన్నట్టే, సంజీవుడు కూడా రాజు నిష్పక్షపాతి అనీ, సహనశీలుడనీ భావిస్తూ వచ్చాడు. అలాకాక ఆయనలోకూడా కొన్నయినా అతి సామాన్యమైన లక్షణాలున్నాయని బైటపడగానే, ఆయనపై కవిత్వం చెప్పి ఇంత డబ్బు చేసుకునేందుకు సంజీవుడు కవిగా తన అర్హత గురించి ఆలోచించలేదు! స్వతంత్రం లేని చోట చమత్కారాలు ఎలాగూ చెప్పలేడు కాబట్టి, సంజీవుడు రాజుపై కావ్యం రాసి, ఆయన ఇచ్చిన ధనం తీసుకుని స్వగ్రామం వెళ్ళిపోయాడు. ఈ అన్ని కారణాలవల్లా, సంజీవుడికి, రాజంటే భయమని గానీ, డబ్బంటే ఆశ అని గానీ అనుకోవడానికి ఏమాత్రం ఆస్కారం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



## చందమామ అనుబంధం - 59

మనదేశపు పక్షులు - జంతువులు :

# సారసపక్షులు



ఎత్తయిన పక్షులలో దాదాపు అయిదు అడుగుల ఎత్తు ఎదిగే కొంగ జాతికి చెందిన సారస పక్షులు చాలా అందమైనవి. వీటి శరీరమంతా లేత బూడిద రంగులో ఉంటుంది. మెడ కింది భాగం, రెక్కల అంచులు మాత్రం తెల్లగా ఉంటాయి. మెడ పైభాగం, తలా ఎర్రగా ఉంటాయి. వీటి పొడవాటి కాళ్ళు ఎర్రగా ఉంటాయి.

కొంగలన్నిటిలోకీ చాలా దృఢమైన ఈ పక్షులు చాలా ధైర్యం కలవి. మనుషులను చూసి బెదరవు. క్రిమి కీటకాలనూ, పొలాల లోని, ధాన్యాలనూ తింటూ ఇవి, మానవ నివాసాలకు సమీపంలో నివసిస్తాయి.

సారస పక్షులు మామూలుగా జంటలుగానే నివసిస్తాయి. ఇవి బతికినన్నాళ్ళు పరస్పర ప్రేమతో బతుకుతాయని చెబుతారు. ఒకవేళ జంటలో ఒక పక్షి చనిపోతే రెండవ పక్షి ఆ దుఃఖంతోనే ప్రాణాలు విడుస్తుందని కూడా చెబుతారు. అందుకే మనదేశంలో నూతన వధూవరులను 'క్రౌంచమిధునం'లా జీవించమని ఆశీర్వదిస్తారు.

ఎగిరే పక్షులన్నిటిలోకీ చాలా ఎత్తయినది సారసపక్షి అని అంటారు. నిదానంగా పైకెగిరి, పెద్ద పెద్ద రెక్కలను ఊపుతూ ఇవి హుందాగా ఎగురుతాయి. ఎగిరేప్పుడు ఒక్కొక్కసారి వింత కంఠ స్వరంతో అరుస్తాయి.

సారస పక్షులు చిత్తడి ప్రదేశంలో పుల్లలతో, గడ్డి పరకలతో పెద్ద పెద్ద గూళ్ళు కట్టుకుంటాయి. జూలై - డిసెంబర్ నెలలమధ్య గుడ్లు పెడతాయి.








# జైమినీరాయ్

జైమినీరాయ్ వర్ణ చిత్రాలను మొట్టమొదటిసారిగా చూస్తున్నప్పుడే అవి మనల్ని అకట్టుకుంటాయి. అవి మనకు చిరపరిచితాలుగా కనిపిస్తాయి. భారతీయ జానపద శైలినీ, అధునిక పద్ధతినీ అందంగా మేళవించి ఆ చిత్రాలు చిత్రించడం వల్ల మనలో అటువంటి భావం కలుగుతుంది. అలాంటి ప్రత్యేకమైన శైలిలో చిత్రాలుగీయడంలో ప్రసిద్ధిగాంచిన చిత్రకారుడు జైమినీరాయ్!

పశ్చిమబెంగాల్‌లోని బంకూరా జిల్లా, బెలితోల్ అనే గ్రామంలో జైమినీరాయ్ 1887వ సం॥లో జన్మించాడు.



ఇతర గ్రామాలలోలాగే ఆనాటి బెలితోల్ గ్రామప్రజలు, వివిధ వృత్తులను చేసుకుని జీవించే వాళ్ళు. కుర్రవాడుగా వున్న జైమినీరాయ్, కుండలు చేసే వాళ్ళనూ, బొమ్మలు చేసే వాళ్ళనూ, వడ్రంగంపని చేసే వాళ్ళనూ, నేత నేసే వాళ్ళనూ, బొమ్మలు గీసే వాళ్ళనూ ఎంతో ఆసక్తిగా గంటల తరబడి చూస్తూ ఉండేవాడు. ముఖ్యంగా, వస్త్రాల మీద రంగురంగుల బొమ్మలు గీసే వాళ్ళను చూస్తూంటే అతనికి పొద్దు పోయేదే తెలిసేదికాదు.



వాటిని చూసి కొన్నాళ్ళకు జైమిని, సొంతంగా బొమ్మలు గీయడం మొదలు పెట్టాడు. కుర్రవాడి ఆసక్తిని గమనించిన తండ్రి, అతన్ని కలకత్తాలోని 'గవర్నమెంటు స్కూల్ ఆఫ్ ఆర్ట్'లో చేర్పించాడు.

ఆ పాఠశాలలో అతనికి పాశ్చాత్య శైలిలో చిత్రాలు గీసే పద్ధతిని ఎక్కువగా నేర్పారు. జైమిని దానిని క్షుణ్ణంగా అభ్యసించాడు. అందరూ అతని నైపుణ్యాన్ని మెచ్చుకున్నారు. ఆ సమయంలో ఆయన తనకంటూ ఒక ప్రత్యేక శైలిని అభివృద్ధి చేసుకోవాలని, అందు కోసం కృషి చేయసాగాడు.

జానపదుల జీవితాన్ని తీసుకుని, జానపద సంప్రదాయ పద్ధతిలో, జానపదులు వాడే రంగులను ఉపయోగించి, చిత్రాలు చిత్రించడం పూనుకున్నాడు. ఆ చిత్రాలలో నూతన శక్తి, లయ, స్పష్టంగా కనిపించ సాగాయి. అవి ఎంతో ఆకర్షణీయంగా అందరి దృష్టినీ ఆకర్షించాయి. ఆయన నైపుణ్యానికి మంచి గుర్తింపు లభించింది.

జైమినీరాయ్ ఎందరో యువకళాకారులను ప్రభావితం చేసి, వారి దృష్టిని భారతీయ చిత్ర కళా సంప్రదాయ పద్ధతుల కేసి మళ్ళించాడు.

ఆయన 1972వ సం॥ఏప్రిల్ నెలలో కీర్తిశేషుడయ్యాడు.

# మీకు తెలుసా?

1. బంగ్లాదేశ్ ఎప్పుడు ఏర్పడింది?
2. జీలంనదికి ప్రాచీన కాలంలో వేరొక పేరు ఉండేది. అదేమిటో తెలుసా?
3. రెండవ ప్రపంచ యుద్ధానంతరం (1945) తూర్పు - పశ్చిమ జర్మనీలుగా విడిపోయిన జర్మనీ, ఆ తరవాత రెండూ ఒకటిగా కలిసిపోయాయి. ఎప్పుడు కలిశాయో తెలుసా?
4. 'నల్ సరోవర్' అనే పక్షుల శరణాలయం ఏ రాష్ట్రంలో ఉన్నది?
5. 'పవిత్ర రోమన్ సామ్రాజ్యం'లో 'పవిత్రతా లేదు', 'సామ్రాజ్యమూ లేదు' అంటూ దానిని నిర్మూలించిన ప్రపంచ నాయకుడు ఎవరు?
6. 'సిక్కిం' మనదేశంలో 22వ రాష్ట్రంగా ఎప్పుడు ఏర్పడింది?
7. సూర్యుడికన్నా 28 రెట్లు ప్రకాశవంతమైన నక్షత్రం ఏది?
8. మన రాజ్యాంగం ప్రకారం ఎన్ని 'అధికార' భాషలు ఉన్నాయి?
9. ప్రాచీన గ్రీకు క్రీడలకూ, ఆధునిక ఒలింపిక్ క్రీడలకూ మధ్య దాదాపు 1,500 సం॥ల అంతరం ఉన్నది. మొట్టమొదటి ఆధునిక ఒలింపిక్ క్రీడలు ఎప్పుడు జరిగాయి?
10. సున్నాను ఒక అంకెగా మొట్టమొదట ఉపయోగించిన భారతీయ శాస్త్రవేత్త ఎవరు?
11. వైద్యానికి ఎక్కువగా ఉపయోగపడే చెట్టు ఏది?
12. ప్రపంచంలోకెల్లా అతి చిన్న 'రాజ్యం' ఏది?
13. పల్లవులు నిర్మించిన అతి ప్రసిద్ధిగాంచిన దేవాలయం ఏది?
14. 13,000 ద్వీపాలు కలిగిన దేశం ఏది?
15. ఈనాటి మన ప్రముఖ అణు శాస్త్రవేత్త డా॥ రామన్న మరొక విషయంలో కూడా ప్రసిద్ధుడు. ఎందులో?

# సమాధానాలు

1. 1971, మార్చ్ 21.
2. వితస్త.
3. 1990, అక్టోబర్ 3.
4. గుజరాత్.
5. నెపోలియన్‌బోనపార్టే (1806).
6. 1975.
7. సిరియస్.
8. పదిహేను.
9. 1896.
10. బ్రహ్మగుప్తుడు.
11. వేపచెట్టు.
12. వాటికన్ నగరం.
13. మహాబలిపురం సముద్ర తీర ఆలయం.
14. ఇండొనేషియా.
15. పియానో విద్వాంసుడు.




# అక్షరశిల్పి

ఒక అడవి సమీపాన గల గ్రామంలో, రామదాసనే కట్టెలు కొట్టి జీవించేవాడుండేవాడు. వాడి భార్య పేరు మంగమ్మ, కొడుకు శివుడు.

రామదాసుకు చిన్నతనంలో చదువుకోవాలని ఆశగా వుండేది. కాని, తండ్రి అందుకు ఇష్టపడక అతణ్ణి తనతోపాటు అడవికి తీసుకుపోయి కట్టెలు కొట్టడం నేర్పాడు. అయితే, రామదాసు మాత్రం తన కొడుకు శివుణ్ణి వేరేదైనా వృత్తిలో పెట్టాలనే ఉద్దేశంతో, వాణ్ణి గ్రామంలోని వీధిబడిలో చేర్పాడు.

శివుడికి చదువు మీద ధ్యాస లేదు. ఆటపాటలంటే వాడికిష్టం. ఒకనాడు రామదాసు అడవి నుంచి కట్టెలమోపుతో తిరిగి వస్తూండగా, బడిపంతులు వాడికి ఎదురుపడి, "ఒరే, దాసూ! నువ్వు నీ కొడుకును బాగా చదివించాలని ముచ్చట పడుతున్నావు. కాని, వాడికి చదువబ్బేలా లేదు. ఒకసారి గట్టిగా కోప్పడి చూడు," అని హెచ్చరించాడు.

రామదాసు ఇంటికి వస్తూనే కొడుకును పిలిచి, "ఏరా, శివుడూ! నీకు చదువు మీద మనసు పోవడంలేదట. మీ పంతులయ్య చెప్పాడు," అని గదమాయించాడు.

దానికి శివుడు, "నాకు చదువుకోవాలని లేదు. నేను నీతో అడవికొచ్చి కట్టెలు కొడతా," అన్నాడు.

ఇది వింటూనే రామదాసు కోపంతో శివుడి వీపు మీద గట్టిగా కొట్టాడు. శివుడు రెచ్చిపోయి, "నేను బాగా చదవడం లేదని కొట్టావు. అసలు నీకు అక్షరాలే రావే!"అన్నాడు.

ఆ జవాబుకు రామదాసు అభిమానం దెబ్బతిన్నది. అతడు భార్యతో, "చూశావా! నాకు చదువు రాదని, నా కొడుకే గేలి చేశాడు. చదువుకుని వుంటే ఎంత బావుండేది," అన్నాడు.

మంగమ్మ సర్దుబాటుగా, "చిన్నవాడు తెలియక ఏదో అన్నాడు. నేను చిన్నతనంలో

ఎన్. శివనాగేశ్వరరావు



అంతో ఇంతో చదువుకున్నదాన్ని. చెబుతాను నేర్చుకో," అన్నది.

"చదువంటే మాటలా? అందులోనూ ఈ వయసులో!" అంటూ ఆశ్చర్యపోయాడు రామదాసు.

"చదువుకు వయసేమిటి? పట్టుదల వుంటే ఏదైనా సాధించవచ్చు," అని మంగమ్మ, ఆ రాత్రి పలక మీద అక్షరాలు రాసి భర్త చేత దిద్దించింది. రామదాసు అక్షరాలు దిద్ది ఆలస్యంగా పడుకున్నాడు. మర్నాడు సూర్యోదయంతోనే లేవలేకపోయాడు. లేచేసరికి బారెడు పొద్దెక్కి పోయింది. దానితో తిండి కూడా సరిగా తినకుండా, గొడ్డలి తీసుకుని హడావుడిగా అడవికి వెళ్ళిపోయాడు.

వారం రోజులపాటు ఇలాగే జరిగింది. రామదాసు చదువు మానేస్తానన్నాడు. అయితే, భార్య అందుకు ఒప్పుకోక, "నేను పలక మీద అక్షరాలు రాసిస్తాను. అడవిలో కట్టెలు కొట్టి అలసిపోయినప్పుడు, కొద్దిసేపైనా విశ్రాంతి తీసుకుంటావు గదా! ఆ సమయంలో అక్షరాలు దిద్దుకో," అని సలహా ఇచ్చింది.

రామదాసుకు ఈ సలహా నచ్చి, అలాగే చేయసాగాడు.

ఒకనాడు మిట్టమధ్యాహ్నం వేళ అడవిలో గుర్రం మీద పోతున్న బాటసారి ఒకడు, చెట్టు కింద గుర్రాన్ని ఆపి దిగి, చెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటూ, రామదాసు చెట్టుకు వేళ్ళాడుతున్న పలక తీసుకుని అక్షరాలు దిద్దడం చూసి ఆశ్చర్యపోయాడు.

బాటసారి, సంగతేమిటో కనుక్కుందామని రామదాసు దగ్గరకు వచ్చి, "ఏమయ్యా, నువ్వు అడవికెందుకొచ్చినట్టు! కట్టెలు కొట్టడానికా, చదువు నేర్చుకోవడానికా?" అని అడిగాడు.

అందుకు రామదాసు, "అయ్యా, నాకు చిన్నప్పటి నుంచీ చదువుకోవాలన్న కోరిక వుంది," అంటూ జరిగిందంతా బాటసారికి వివరించాడు. బాటసారి అతణ్ణి మెచ్చుకుని, "నువ్వు పట్టుదల మాత్రం వదలకు!" అని, అతడి పేరూ, గ్రామం వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు.

ఇది జరిగిన నాలుగు నెలలకు, ఒకనాడు రామదాసు అడవి నుంచి రాగానే, భార్య

మంగమ్మ అతడితో, "నువ్వా మధ్య ఎవరో బాటసారి అడవిలో నువ్వు చదువుకోవడాన్ని మెచ్చుకున్నాడని చెప్పావు. ఆయన తన సేవకులతో నీకోసం చాలా పుస్తకాలు పంపాడు. అక్షరాలు నేర్చుకోవడమే కాదు, ఈ పుస్తకాలన్నీ చదివి జ్ఞానవంతుడివి కావాలని చెప్పమన్నాడట!" అన్నది.

ఆ రోజు నుంచి రామదాసులో విపరీతమైన మార్పు వచ్చింది. రాత్రిళ్ళు కూర్చుని చిన్న చిన్న పదాలు కూడబలుక్కుంటూ పుస్తకాలు చదవడం మొదలుపెట్టాడు. తండ్రిని గమనిస్తున్న శివుడు, తను కూడా బడి పుస్తకాలు శ్రద్ధగా చదవడం ప్రారంభించాడు. వాడి చదువులో అభివృద్ధి రాసాగింది.

ఒకరోజు రామదాసు, తాను చదివిన దాంట్లో ఏదో అనుమానం కలిగి, భార్యనడిగాడు. ఆమె నవ్వి, "నన్నడిగి లాభంలేదు. నా వానాకాలం చదువును ఏనాడో మించిపోయావు. ఇక నీ అనుమానాల సంగతి పండితుడు విష్ణుశర్మగారి నడుగు!" అన్నది.

ఒకనాడు రామదాసు అడవి నుంచి వస్తూండగా, ఒక చెట్టు కొమ్మ మీది నుంచి కోయిల కుహూ అంటూ అరిచింది. వెంట వున్న శివుడు, కోయిల అరుపు విని, తను కూడా కుహూ అంటూ అరిచాడు. కోయిల జవాబుగా పెద్ద కూత పెట్టింది. ఆ క్షణంలో రామదాసు మనసులో ఏవో కొత్త భావాలు కదలాడాయి. రోజూ చూసే అడవే అయినా,



అది రామదాసుకు ఆరోజు కొత్తగా కనిపించింది. పచ్చటి చెట్లు, విరబూసిన పూలు, మెత్తని పచ్చిక, పాడే పిట్టలు, తనను చూసి పారిపోయేచిన్నచిన్నజంతువులు-అన్నీ రామదాసు మనసుకు ఉత్తేజాన్ని కలిగించాయి.

రామదాసు ఇల్లు చేరగానే, తన మనసులో కదలాడే భావాలను కాగితం మీద రాశాడు. అది ఒకసారి చదివి చూస్తే, అతడికి విపరీతమైన సంతోషం కలిగింది. మర్నాడు దాన్ని తీసుకుపోయి విష్ణుశర్మకు చూపించాడు.

విష్ణుశర్మ చదివి, "ఏమోయ్! కవిత్వం మొదలుపెట్టావా? ఇలాంటి పిచ్చి పనులు చేశావంటే, తినడానికి తిండి కూడా వుండదు. హాయిగా కట్టెలు కొట్టుకొని బ్రతుకు," అన్నాడు.



రామదాసు మనసు చివుక్కుమన్నది. ఇంటికి పోయి, జరిగింది భార్యకు చెబితే, ఆమె ఆ రాసిందేమిటో చదివి వినిపించ మన్నది. అంతా విని, "ఇంత బాగా రాస్తే, మెచ్చుకోవలసిందిపోయి కసురుకున్నాడంటే, విష్ణు శర్మకు నీమీద అసూయ కలిగిందన్న మాట! ఇక ఆయన దగ్గరకు వెళ్ళకు," అన్నది.

ఇది జరిగిన రెండు నెలలకు, రాజధాని నుంచి వచ్చిన రాజభటులు గ్రామంలో ఒక చాటింపు వేశారు. అదేమంటే – ఉగాదినాడు మహారాజు రాజధానిలో కవిత్వపు పోటీలు ఏర్పాటుచేశాడు. విజేతలకు మంచి బహుమతులిస్తారు.

రామదాసు భార్య, భర్తతో, "ఈ పోటీలకు వెళ్ళి, మహారాజు గారికి నీ కవిత్వం వినిపించు," అన్నది.

అందుకు రామదాసు, "అక్కడ ఎందరో పెద్ద కవులు వస్తారు. వాళ్ళ ముందు నా కవిత్వం ఏపాటిది!" అన్నాడు.

"నీకు బహుమతులు రాకపోయినా, వాళ్ళ కవిత్వం విని, నిన్ను నీవు మెరుగుపరుచుకో వచ్చు," అన్నది మంగమ్మ.

ఈ సూచన రామదాసుకు సమంజసంగా తోచింది. ఉగాది నాడు రామదాసు ఉన్నంతలో మంచి బట్టలు వేసుకుని, రాజధాని చేరి, రాజుగారి మందిరానికి వెళ్ళాడు.

మహారాజు సింహభూపతి, అక్కడ చేరిన వారితో, "ఇంతవరకూ పండితులే కవిత్వం చెప్పేవారు. కానీ, సామాన్యప్రజానీకంలో కూడా వెలుగులోకి రాని కవులుంటారని, ఈ పోటీ పెట్టి దండోరా వేయించాను. సంకోచించక, మీ మీ కవిత్వాలు వినిపించండి!" అన్నాడు.

ఒక్కొక్క కవీ తాను రాసిన కవిత్వం విని పించసాగాడు. రామదాసు వంతు వచ్చింది. అతడు 'అడవితల్లి' పేరున అడవి గురించి రాసిన కవిత్వం వినిపించాడు. అందులో అడవి గురించిన వర్ణన సరళంగా, మనోరంజ కంగా వున్నది.

న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన కవీశ్వ రులు, అందరికంటే ఉత్తమమైన కవిత్వం

చెప్పినది రామదాసని, హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

ఇది విని రామదాసు పరమానందం చెందాడు. రాజు సింహభూపతి రామదాసును అభినందించి, బహుమతి ప్రదానం చేయ బోగా, రామదాసు, "మహారాజా! ఈ క్షణంలో నాకు ఆనందంతో పాటు, కించిత్తు బాధ కూడా కలుగుతున్నది," అని, అరణ్యంలో కట్టెలు కొట్టుకుంటున్న తనను, బాగా చదువు కోమని ప్రోత్సహించడమే కాక, ఇంటికి పుస్త కాలు కూడా పంపిన వ్యక్తిని గురించి చెప్పి, "ఆ మహానుభావుడి పేరూ, ఊరూ కూడా నాకు తెలియదు. ఈ ఆనందసమయంలో ఆయనకు కృతజ్ఞత చెప్పలేకపోతున్నానన్నది, నన్ను బాధిస్తున్నది," అన్నాడు.

ఇందుకు రాజు చిరునవ్వు నవ్వి, "ఆ బాటసారిని నేనే, రామదాసూ!" అన్నాడు.

రామదాసు, రాజు ముఖంలోకి పరీక్షగా చూసి, ఆయన పాదాలకు నమస్కరించాడు.

రాజు, రామదాసు భుజం తట్టి, సభికు లతో, "నేను గతంలో ఒకసారి మారువేషంలో దేశ సంచారం చేస్తూండగా, అడవిలో ఈ రామదాసు కట్టెలు కొడుతూ, మధ్య మధ్య పలక మీది అక్షరాలు దిద్దుతూ కనిపించాడు. ఒక కష్టజీవి, వయోజనుడు చదువు మీద మక్కువ చూపడం, నాకు సంతోషం కలిగిం చింది. అందువల్లనే, రాజధాని చేరాక మంచి పుస్తకాలు ఎంపిక చేసి రామదాసు ఇంటికి పంపాను.తర్వాత అతను కవిత్వం రాసే స్థాయికి ఎదిగాడని విని చాలా గర్వ పడ్డాను. ఒకరకంగా ఈ కవిత్వం పోటీలు పెట్టడానికి కారణం రామదాసే. ఒకప్పుడు అక్షరాలు రాని రామదాసు, నేడు పట్టుదలతో అక్షరశిల్పిగా మారి, అక్షరాలను అందమైన శిల్పాలుగా మలిచి సుందరమైన కవిత్వం చెబుతున్నాడు. మన రాజ్యంలోని నిరక్షరాస్యు లలో ఇంకెందరో అక్షరశిల్పులు వుండవచ్చు. అందరూ కృషి చేసి విద్యావంతులు కాగలరని ఆశిస్తున్నాను!" అన్నాడు.

తర్వాత ఆయన, రామదాసును ఘనంగా సన్మానించి, అతడుంటున్న గ్రామంలో కొంత భూమిని దానంగా ఇచ్చి సాగనంపాడు.





# ప్రతిఫలం

వీరభద్రం అనే రైతు, తను కొత్తగా కొన్న ఇంటి పెరట్లో బావి తవ్వించాలన్న ప్రయత్నంలో వున్నాడు. ఈ సంగతి తెలిసి, చెన్నకేశవులనే అతను, వీరభద్రాన్ని కలుసుకుని, "మీరు కొత్త ఇంటికి బావి తవ్వించాలనుకుంటున్నారట. ఆ పని నాకు అప్పగించండి. నేను భూమి లోపల జల ఎక్కడున్నా పసికట్టి చెప్పగలను. నా తాత తండ్రుల దగ్గరి నుంచి నేర్చుకున్న ఈవిద్యతో నేను ఎందరి ఇళ్ళల్లోనో ఏ ప్రయాసా లేకుండా బావులు తవ్వించాను," అన్నాడు.

వీరభద్రం జవాబిచ్చేలోపల, సమయానికక్కడే వున్న పొరుగింటి రామనాధం, "వీరభద్రం గారూ! మీరు గ్రామానికి కొత్తవారు. ఈ చెన్నకేశవుల్ని గురించి మీకు తెలియదు గనక చెబుతున్నాను. బావి తవ్వించే పని ఈయన కప్పగించండి. ఇలాంటి విషయాల్లో, ఈయన చాలా ప్రజ్ఞావంతుడు," అని అన్నాడు.

వీరభద్రం వేళాకోళం చేస్తున్నట్టుగా, "అదేమిటి, రామనాధంగారూ! ఒక్కొక్కసారి మనకు దాపులనున్న వస్తువులే సరిగా కనబడవు. అలాంటప్పుడు భూమి అడుగున వున్న జల ఎక్కడ వస్తుందో చెప్పడం ఎలా సాధ్యపడుతుంది?" అని, చెన్నకేశవులుతో, "కళ్ళకు అంజనాలు రాసుకునో, లేక మాయాదుర్భిణిలు ఉపయోగించో మంత్రగాళ్ళు, భూమి అడుగున ఏమున్నదో తెలుసుకునే వాళ్ళని కథల్లో చదివాను. అయితే, నాకలాంటి విద్యల్లో నమ్మకం లేదు. కూలివాళ్ళను పెట్టిపెరట్లో బావి నేనే తవ్వించుకుంటాను," అన్నాడు.

తాను చేయబోయే పనిలో మంత్రతంత్రాల ప్రసక్తే లేదనీ, అంతా సశాస్త్రీయమైన పద్ధతే అనీ చెన్నకేశవులు, వీరభద్రానికి వివరించి చెప్పబోయాడు. అయినా, వీరభద్రం అతడి మాటల్ని పట్టించుకోలేదు.

సాయిరాం ప్రసాద్

చివరకు చెన్నకేశవులు వినయంగా, "సరే, తమ ఇష్టం!" అని వీరభద్రం దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడే వీరభద్రం నలుగురు కూలి వాళ్ళను పిలిపించి, పెరట్లో ఒకమూల వాళ్ళ చేత బావి తవ్వించడం మొదలుపెట్టాడు. పది రోజల పాటు తవ్వగా వాళ్ళకు భూమిలో ఒక రాతిపొర తగిలి పని ఆగిపోయింది.

కూలివాళ్ళు, వీరభద్రానికీ సంగతి చెప్పి, "అయ్యా, ఈ రాతిపొరను తవ్వి ఇంకా లోతుకు పోవడం, మావల్ల అయ్యే పని కాదు. ఒకవేళ అది సాధ్యమైనా, అక్కడ నీటి జల కాదు గదా, ఊట అయినా వుంటుందో లేదో చెప్పలేం. కనక మా కూలిడబ్బులు మాకివ్వండి. పోయి మరెక్కడైనా పని చూసుకుంటాం," అన్నారు.

ఈ జరిగిందానికి వీరభద్రం చాలా బాధ పడుతూ, కూలివాళ్ళకు డబ్బులిచ్చి, పొరుగింటి రామనాధంతో ఇప్పుడేం చేయాలో తోచడం లేదన్నాడు.

ఇందుకు రామనాధం, "మీరు ముందే నా సలహా పాటిస్తే బావుండేది. జరిగిన నష్టానికి విచారించకండి. చెన్నకేశవుల్ని పిలిపిద్దాం," అన్నాడు.

మరొక మార్గం తోచక వీరభద్రం, చెన్నకేశవులు కోసం కబురు పెట్టాడు. అతను వచ్చి పెరడంతా ఒకసారి కలియతిరిగి, అక్కడ వున్న చిన్న చిన్న మొక్కల్నీ, పచ్చగడ్డి




పరకల్నీ పరిశీలించి, చివరకు ఈశాన్యం మూల గునపాన్ని భూమిలోకి దింపి వీరభద్రంతో, "అయ్యా, ఇదీ బావి తవ్వడానికి అనువైన చోటు! నేను రేపు కూలీలను వెంటబెట్టుకుని స్వయంగా వచ్చి, బావి పని పూర్తి చేస్తాను," అన్నాడు.

ఆ మర్నాడు చెన్నకేశవులు నలుగురు కూలీలను వెంటబెట్టుకు వచ్చి, గునపం గుచ్చిన చోటు వాళ్ళకు చూపించి, "ఇక్కడ తవ్వండి!" అన్నాడు.

కూలీలు మూడు రోజుల పాటు తవ్వకం సాగించాక, భూమిలో నుంచి పుష్కలంగా నీటి ఊటలు రావడం ప్రారంభమై, చూస్తుండగానే పెద్ద జల పడింది.

ఇదిచూసి వీరభద్రం ఆనందపడిపోగా చెన్నకేశవులు, "అయ్యా, చూశారా! మొదటే తమరు నాకీ బావి తవ్వే భారం అప్పగిస్తే, మీకు అనవసరమైన ఖర్చు తప్పేది. నా మాటల మీద నమ్మకం వుంచారు కాదు. సరే, నేనూహించిన దానికన్నా పెద్ద జలే పడింది. డబ్బిప్పించండి, వెళతాను," అన్నాడు.

"ఎంతేమిటి, ఆ మొత్తం?" అని అడిగాడు వీరభద్రం.

"అంతా కలిపి అయిదొందలు," అన్నాడు చెన్నకేశవులు.

ఇది విని వీరభద్రం చిరాకు పడుతూ, "మూడు రోజుల్లో పని పూర్తయింది కదా! ఐదు వందలు దేనికి?" అన్నాడు.

చెన్నకేశవులు తాపీగా, "అయ్యా! అందులో వంద రూపాయలు కూలీల కోసం. మిగిలిన నాలుగు వందలూ, ఎక్కడ తవ్వితే జల పడుతుందో గ్రహించి బావి తవ్వించినందుకు, నేను పుచ్చుకుంటున్న ప్రతిఫలం. ఇందులో నేను మంత్రతంత్రాలూ, దుర్భిణిలూ ఉపయోగించలేదని, తమరే చూశారు గదా!" అన్నాడు.

ఆ మాటలతో వీరభద్రం ముఖం చిన్న బుచ్చుకుని, ఇంటి లోపలికి వెళ్ళి డబ్బు తెచ్చి చెన్నకేశవులుకిచ్చాడు.

ఆ సమయంలో అక్కడికొచ్చిన రామనాథం, జరిగిందేమిటో తెలుసుకుని, వీరభద్రంతో, "మీరు మొదట్లోనే నా మాట విని వుంటే, కొంత శ్రమా తగ్గేది, పెరట్లో వృథాగా రెండు నిలువుల లోతు గొయ్యి తవ్విపోయిన కూలీలకు ఇచ్చిన డబ్బూ మిగిలేది. ఇదేదో చిన్న పెరటి బావి గనుక సరిపోయింది. ఏ బీడు ప్రదేశంలోనో, సాగునీళ్ళ కోసం బావి తవ్వించాలంటే, ఎక్కడని తవ్వించగలం? అలాంటి సమయాల్లో, ఇదేదో మూఢనమ్మకం అని తోసిపుచ్చక, అనుభవశాలులైన చెన్నకేశవులు లాంటి వాళ్ళను సంప్రతించడం మేలు! చాలా ఉపయోగకరం! ఏమంటారు?" అన్నాడు.

"అనేందుకేమున్నది! ఇక ఈ క్షణం నుంచి నచ్చని ప్రతిదాన్నీ మూఢత్వం అనుకునే, నా మూఢత్వానికి స్వస్తి పలుకుతాను," అన్నాడు వీరభద్రం.





రాముడు రాజ్యం చేస్తూండగా ఉత్తర దిక్కున గంధర్వులు విజృంభించి ప్రజలను బాధించ సాగారు. భరతుడు సేనలతో వెళ్ళి గొప్ప యుద్ధంచేసి వారిని అణచివేశాడు. గంధ ర్వుల దుండగాల నుంచి ప్రజలు బయటపడి సుఖించారు. అటు పిమ్మట వాయవ్య దిక్కున లవణాసురుడు అనే రాక్షసుడు ప్రళయం లాగ విజృంభించాడు. రాముడు శత్రుఘ్నుడికి దివ్యాస్త్రాలను ఇచ్చి లవణుడిని సంహరించి రమ్మని చెప్పాడు. శత్రుఘ్నుడికి తోడుగా రాక్షసమాయలకు ప్రతిక్రియలు చెప్పగల విభీషణుడు కూడా ఉంటే మంచి దని, లంకకు హనుమంతుడి చేత కబురు పంపించాడు. లంక నుంచి విభీషణుడు రాక్షసవీరులను వెంటబెట్టుకొని వచ్చాడు. శత్రుఘ్నుడు తన సేనలతో రాక్షసులను కూడా కలుపుకుని, విభీషణుడితో కలిసి, లవణాసురుడి పైకి యుద్ధానికి వెళ్లాడు.

శత్రుఘ్నుడు సుదర్శన చక్రాయుధం లాగ విజృంభించి లవణాసురుడి సేనలను చీల్చి చెండాడాడు. అప్పుడు జరిగిన ఘోర సంగ్రా మంలో, విభీషణుడి రాక్షస సేన కూడా గొప్ప పరాక్రమం చూపింది. శత్రుఘ్నుడు లవణాసురుడితో యుద్ధం చేసి వాణ్ణి సంహ రించాడు. విజయం సాధించి శత్రుఘ్నుడూ, విభీషణుడూ సేనలతో అయోధ్యకు తిరిగి వచ్చారు.

ఒకనాడు రాముడు తన కొలువుకూటానికి వచ్చి, సింహాసనం మీద కూర్చున్నాడు. ఎడమ పక్క సీత కూర్చున్నది. రాముడికి ముందు



హనుమంతుడు, భరత, లక్ష్మణ, శత్రుఘ్న, సుగ్రీవ, అంగద, నల, నీల, జాంబవంత, విభీషణాదులూ, వసిష్ఠ, వామదేవాదులూ సభను అలంకరించి ఉన్నారు.

ఆ సమయంలో ఆ సభకు అగస్త్యమహా ముని వచ్చాడు. రాముడు ఆయనకు చేతు లెత్తి నమస్కారం చేసి, అతిథి సత్కారాలు జరిపి, క్షేమ సమాచారాలు అడిగాడు.

దానికి అగస్త్యుడు, "దుష్ట శిక్షణా, శిష్టరక్షణా చేసే వాడివి నువ్వు ఉండగా మాకు క్షేమం కాకేమి, రామా? నువ్వు దశకంఠుడైన రావణుణ్ణి చంపి గొప్ప కీర్తి సంపాదించావు నిజమేగాని, తిక్త సముద్రం అవతల మాయానగరం రాజధానిగా చేసుకుని శతకంఠుడనే రాక్షసుడు నిన్ను జయించాలనే ఉద్దేశంతో ఉన్నాడు," అన్నాడు.

రాముడు అమితాశ్చర్యంతో, వాడి కథ చెప్పమని అగస్త్యుణ్ణి అడిగాడు. అగస్త్యుడు ఇలా చెప్పాడు:

"కశ్యపుడికి వసువు అనే భార్య ఉండేది. ఆమె అసురసంధ్య వేళ గర్భవతి అయి, మహావికృతమైన ఆకారం గల శతకంఠుణ్ణి కన్నది. వాడు బ్రహ్మదేవుణ్ణి గురించి దారుణ మైన తపస్సు చేశాడు. బ్రహ్మ సంతోషించి, శతకంఠుడికి ప్రత్యక్షమై, దేవేంద్రుడు మొదలైన దేవతలకు అసాధ్యమైన వరాలు ఇచ్చేశాడు. దానితో వాడు విజృంభించి, మూడు లోకా లనూ జయించే ఆలోచనలో ఉన్నాడు. రామా, నువ్వు వాణ్ణి యుద్ధంలో చంపాలి."

రాముడు కొంచెం ఆలోచించి, "వాడు చూడటానికి ఎలా ఉంటాడు?" అని అగ స్త్యుణ్ణి అడిగాడు.

"వాడు ఎలా ఉంటే మాత్రం నీ బాణాలకు అసాధ్యమేమిటి? రావణుడికి పదిరెట్లు ప్రతా పమూ, భీకర కంఠస్వరమూ గలవాడు. వాణ్ణి ఎలా చంపాలో నీకు ఒకరు చెప్పాలా?" అన్నాడు అగస్త్యుడు.

అగస్త్యుడు వెళ్ళిపోయాక రాముడు తన తమ్ములతో, "యుద్ధంలో రావణ, కుంభకర్ణాది రాక్షసులను చంపి అలిసి ఉన్నాను. లక్ష్మణుడు కూడా నాతోపాటు శ్రమపడినవాడే. భరతుడు గంధర్వులతోనూ, శత్రుఘ్నుడు లవణాసురుడి

తోనూ యుద్ధం చేసి అలిసిపోయి ఉన్నారు. ఎక్కడో సముద్రాల అవతల ఉన్న ఈ శత కంఠుణ్ణి చంపటానికి ఎవరిని నియోగిస్తాం? నూరు యోజనాల సముద్రం దాటటమే ఎంతో కష్టమయింది గదా!" అని కొంత విచారంలో పడ్డాడు.

ఇంతలో రాముడి దృష్టి తన ముందు కూర్చుని ఉన్న హనుమంతుడి పైన పడింది. అతను వెంటనే, "హనుమంతుడా! ఈ పని నీ వల్లనే కావాలి. నువ్వు ఏకపాద రుద్రుడివి!" అన్నాడు.

హనుమంతుడు రాముడితో, "మీకీ రాక్షసులనగా ఎంత? నా మీద ఎక్కి, ఆ రాక్షసుడుండే దీవికి పోయి, వాణ్ణి చంపెయ్యండి!" అన్నాడు.

రాముడు హనుమంతుణ్ణి కౌగలించుకుని, "నీకు గల శౌర్యపరాక్రమాలు మరొకరికి వస్తాయా?" అని ఎంతగానో ప్రశంసించాడు.

ఇదంతా వింటూన్న సీత రాముడితో, "ఇతన్ని ఏకపాదరుద్రుడన్నారు. రుద్రుడు కోతి రూపం ధరించటానికి కారణం?" అని అడిగింది.

దానికి రాముడు ఇలా చెప్పాడు:

"బ్రహ్మాండాన్ని పాలించే ఏకపాదరుద్రుడు మహారుద్రగణాలు సేవిస్తూండగా, ఒకసారి తన ధ్యానశక్తితో మహావిష్ణువు రూపాన్ని చూసి, ఎన్నడూ కనిపించని ఆ రూపం తనను కాపాడే ఈశ్వరుడిదే అయి ఉండాలను



కున్నాడు. వెంటనే అతను అక్కడి నుంచి బయలుదేరి, విశ్వమంతా తిరిగి, భూలోకానికి వచ్చి, శివుడిలో ఐక్యమయ్యాడు. ఆ శివుడి అంశ నుంచే పరాక్రమశాలి అయిన హనుమంతుడు పుట్టాడు."

తరవాత రాముడు శతకంఠుడిపై యుద్ధానికి సిద్ధపడ్డాడు. అతని వెంట సీత కూడా వస్తానన్నది. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులూ, సుగ్రీవ, విభీషణులూ, సైన్యమూ యుద్ధానికి కదిలారు. రాముడు హనుమంతుడి కోసం చూస్తే, హనుమంతుడు విశ్వరూపం ధరించి, భూమ్యాకాశాలూ, సమస్త దిక్కులూ నిండి కనిపించాడు. అతని పూర్తి రూపం చూడటం ఎవరికీ సాధ్యం కాలేదు. భయాశ్చర్యాలు



శతకంఠుడు ఉండే మాయాపట్టణం కనిపించింది. ఆ నగరం చుట్టూ బంగారు ప్రాకారం ఉన్నది. హనుమంతుడి వల్ల సాధ్యమయింది గానీ, ఆ సముద్రాలు దాటి ఆ కోటను చేర రావటం మరొకరికి సాధ్యం కాదు.

మాయాపట్టణం గల లంకలో నందన వనానికి తీసిపోని వనం ఉన్నది. రాముడు హనుమంతుణ్ణి అక్కడ దిగమన్నాడు. సేనలూ అక్కడే దిగాయి. రాముడు సుగ్రీవుడు మొదలైన వాళ్ళతో, "మీరు ఈ రాక్షసుడి మీదికి యుద్ధానికి వెళ్లండి," అన్నాడు.

వెంటనే సుగ్రీవ, అంగద, విభీషణాది మహావీరులు తమ సేనలతో శతకంఠుడి నగరం పైకి యుద్ధానికి వెళ్ళారు. వానర సేనా, రాక్షససేనా కలిసి, కోటను సమీపించి, కోట చుట్టూ ఉండే అగడ్తను పూడ్చి, కోట గోడలు కూల్చి, గోపురాలు నేలమట్టం చేసి, ద్వారాల తలుపులు విరగదన్ని విజృంభించారు.

ఆ కోటను రక్షించే కాలకేయులనే వాళ్ళకు ఈ కోతులూ, రాక్షసులూ విజృంభించటం చూసి ఆశ్చర్యం కలిగింది. "ఈ పట్టణాన్ని పాలించేది శతకంఠుడని వీళ్ళకు తెలీదా? వీళ్లు ప్రాణాలతో ఎలా తప్పించుకుందామనుకుంటున్నారు?" అనుకుని సింహనాదాలు చేశారు.

తరవాత ఆ కాలకేయులు రకరకాల ఆయుధాలు ధరించి వానర, రాక్షస సేన

కొలిపే, ఆ రూపాన్ని చూసి అందరూ దిగ్భ్రాంతి చెందారు.

తరవాత హనుమంతుడు భూమి కేసి వంగాడు. అతని వీపు మీద రాముడు సీతను ఎక్కించి, తాను ఎక్కి, తన వెంట వచ్చేవారినీ, వానర, రాక్షస బలాలనూ కూడా ఎక్కమన్నాడు. రాముడి సేనలకు నడకా, ప్రయాసా లేదు. వాళ్ళు హనుమంతుడి వీపు మీద ఆకాశయానం సాగించారు. ఆకాశాన వెళుతున్న హనుమంతుడు ఎగిరే మేరు పర్వతం లాగా కనిపించాడు.

హనుమంతుడు నాలుగు సముద్రాల మీదుగా ఎగిరి పోతూంటే రాముడు సీతకు ఒక్కొక్క సముద్రాన్నే చూపించాడు. చివరకు,



మీదికి వచ్చారు. వాళ్ళ దెబ్బకు తట్టుకోలేక వానరసేన చెల్లాచెదరయింది. విభీషణుడు వానరులను ఆపి, తన రాక్షససేనలను పురికొల్పాడు. వారితో పాటు వానరులు కూడా ఎదురు తిరిగి కాలకేయులను ప్రతిఘటించారు. యుద్ధం తీవ్రంగా సాగింది.

ఈలోపల శతకంఠుడు శివపూజ చేస్తూ ఉండి, యుద్ధ కోలాహలం చెవులపడే సరికి, ద్వారపాలకులను, "ఏమిటా కోలాహలం?" అని అడిగాడు.

ద్వారపాలకులు అతనికి నమస్కరించి, "స్వామీ, ఎవరో రాజు కోతి మీద ఎక్కి ఎక్కడి నుంచో నరవానర, రాక్షసులుగల సేనతో వచ్చి దిగాడు. మన కాలకేయులు వారితో యుద్ధం చేస్తున్నారు. అదే ఆ చప్పుడు," అన్నారు.

"ఎవడో రాజు కోతి మీద ఎక్కి, వానర సేనతో నా నగరం మీదికి యుద్ధానికి వచ్చాడంటే లోకులు నవ్విపోరా! దేవతలే నాకు తలవంచగా ఈ రాజు వానరసేనతో ఎలా వచ్చాడు?" అని శతకంఠుడు తన మంత్రులు మొదలైన వారిని యుద్ధ సన్నద్ధులు కమ్మని, రణభేరి వేయించి, తాను కూడా యుద్ధానికి సిద్ధమయ్యాడు.

తనతో యుద్ధానికి వచ్చిన శతకంఠుడి కిరీటమూ, అలంకారాల కాంతీ, వాడి శరీరమూ, మదమూ చూసి రాముడు అద్భుతం చెందుతూ ఉండిపోయాడు.

అది చూసి హనుమంతుడు, "స్వామీ, ఏమిటి వాణ్ణి చూసి ఆశ్చర్యపడి పోతున్నావు? నీ ప్రతాపం ముందు ఈ రాక్షసుడెంత? వాణ్ణి చంపెయ్యి!" అంటూ వెళ్ళి, విశాలంగా ఉన్న శతకంఠుడి రొమ్ము మీద బలంగా పొడిచాడు.

ఆ దెబ్బకు శతకంఠుడు కిందపడి, వెంటనే లేచి, ఎదురుగా ఉన్న హనుమంతుణ్ణి చూసి, "అరె, ఎంతబలం నీది! వానరుడా, మూడు లోకాలనూ హడలగొట్టే నన్నే పిడికిలి పోటుతో పడగొట్టితివే! ఎంతో తిరిగాను, ఎందరో దేవతలను యుద్ధంలో గెలిచి, ఇంతవాణ్ణి అయ్యాను. కాని నీలాగ నన్ను ఎవరూ పడగొట్టలేదు. నీ ముష్టిదెబ్బ

నేను చూశాను. నా శూలం దెబ్బ నువ్వు చూడు!" అంటూ తనకన్న ఎక్కువ పొడుగు గల శూలాన్ని బలంగా హనుమంతుడి మీదికి విసిరాడు. దాన్ని హనుమంతుడు విరిచి పారేశాడు.

"భేష్!" అంటూ శతకంఠుడు హనుమంతుడి మీద ముసలమూ, గొడ్డలీ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు ప్రయోగించాడు. అన్నింటినీ హనుమంతుడు విరిచేశాడు. రాముడు హనుమంతుణ్ణి చూసి ఆనందించి, తాను ఒక విల్లు తీసుకుని శతకంఠుడిపై యుద్ధానికి వచ్చాడు. రాముడితోపాటు విభీషణుడు కూడా వచ్చాడు. శతకంఠుడు వారిద్దరి బాణాలనూ దారిలోనే భగ్నంచేస్తూ, కాలితో తన్ని, ఇద్దరినీ వెళ్లి లంకలో పడేట్టు చేశాడు.

అప్పుడు హనుమంతుడు తన తోకను నాలుగు సముద్రాల మీదుగా సేతువు కట్టినట్టు పెట్టాడు. రాముడూ, విభీషణుడూ దానిమీద వచ్చారు. వాళ్ళు శతకంఠుడితో యుద్ధం ప్రారంభించగానే వానర సేనలు చెట్లూ, రాళ్ళూ విసిరాయి. శతకంఠుడు అన్నిటినీ తన అస్త్రాలతో నుగ్గు చేస్తూ వచ్చాడు. అతని ధాటికి తట్టుకోలేక అంగదుడూ, నలుడూ, నీలుడూ, ఋక్షజుడూ లాటి మేటి వానర వీరులు అక్కడి నుంచి పారిపోయారు. రాముడి తమ్ములు ముగ్గురూ ఓడిపోయారు.



అప్పుడు రాముడు సీతతో హనుమంతుడి మీద ఎక్కి, శతకంఠుడితో యుద్ధానికి వచ్చాడు. అప్పుడు శతకంఠుడు రాముడితో, "నాతో యుద్ధం చెయ్యటమంటే రావణుడితో యుద్ధం చెయ్యటమనుకున్నావా? ఈ కోతి మీద ఎక్కి ఇంతదూరం నువ్వు ఎందుకు వచ్చినట్టు? పైపెచ్చు సీతను కూడా తెచ్చుకున్నావెందుకు?" అని ఆక్షేపించాడు.

రాముడు అతనిపై అస్త్రాలు వేశాడు. అప్పుడు శతకంఠులు కోట్ల సంఖ్యలో తన ఎదట ఉన్నట్టు రాముడికి తోచింది. రాముడి మహాస్త్రాలన్నీ వ్యర్థమయ్యాయి.

హనుమంతుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను ప్రచండమైన శక్తితో శత

కంఠుడి రాక్షస మూకలను నాశనం చేశాడు. అంతవరకూ యుద్ధం చూస్తూన్న రాముడు విశ్రాంతి కోరినట్టుగా, తన విల్లునూ, రెండు అమ్ములపొదులనూ తన చెంత ఉన్నసీతకు ఇచ్చాడు. వాటిని తీసుకుని సీత శతకం ఠుడితో యుద్ధం చేసింది. శతకంఠుడికి కోపం వచ్చి, ఆమె మీద తన ప్రతాప మంతా చూపుతూ యుద్ధం చేశాడు.

"రాముడు సత్యం తప్పనివాడైతే, నేను పతివ్రతనైతే ఈ బాణంతో రాక్షసుడు చచ్చు గాక!" అని సీత వింటికి బాణం సంధించి వదిలింది. దానితో శతకంఠుడు చచ్చిపడి పోయాడు. సీత తన చేతి విల్లును రాముడికి ఇచ్చి నమస్కరించింది.

రాముడు తన మణిహారాన్ని సీతకు ఇచ్చాడు. సీత రాముడితో, సేనలను చంపి శతకంఠ రావణుడి పతనానికి ఎంతగానో సహాయపడిన హనుమంతుడికే ఆ హారాన్ని ఇయ్యమన్నది. రాముడు ఇచ్చిన హారాన్ని హనుమంతుడు తన మెడలో వేసుకుని పర మానందంతో, "సీతారాములు ప్రసాదించిన ఈ హారం నా వక్షస్థలం మీద ప్రకాశిస్తూ లోపల నా హృదయంలో సీతారాములను ఎల్లప్పుడూ నిలుపుతుంది," అన్నాడు.

అందరూ తిరిగి అయోధ్యకు వెళ్లారు. రాముడి వద్ద శలవు తీసుకుని విభీషణుడు రాక్షసులతో లంకకు వెళ్లాడు. సుగ్రీవుడు మొదలైన వానరులంతా కిష్కింధకు వెళ్లారు. హనుమంతుడు రాముడి దగ్గరే ఉండి పోయాడు.

శతకంఠ రావణ సంహారానంతరం రాముడు నిష్కంటకంగా, ఆదర్శ ప్రాయంగా రాజ్యం చేస్తున్నాడు. రామరాజ్యంలో శోకమూ, క్రోధమూ, ముసలితనమూ, వైరమూ, లోభ మూ, సంక్షోభమూ ఎలా ఉంటాయో మనుష లెరగరు.

రాముడి సేవలో అయోధ్యలో గడుపుతున్న హనుమంతుడికి కొన్నాళ్ళకు తన తల్లి అంజనాదేవిని చూడాలనిపించింది. రాముడి అనుజ్ఞ తీసుకుని హనుమంతుడు గంధ మాదన పర్వతం దగ్గిర ఉంటున్న అంజనా దేవి ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు.





# రెండు మహావృక్షాలు

పూర్వం ఒకప్పుడు నారదుడు భూలోక సంచారం ముగించుకుని, మహావిష్ణువును దర్శించుకుందామని వైకుంఠానికి వెళ్ళాడు.

మహావిష్ణువు, "నారదా! భూలోక సంచారం చేసి వస్తున్నట్టున్నావు, విశేషాలేమిటి? అక్కడి ప్రజలు సర్వసంపదలు కలిగి తృప్తులై సుఖిస్తున్నారా? కలవారిలో దయాధర్మగుణాలూ, బీదలలో నియమనిష్ఠలూ వర్థిల్లుతున్నవా?" అని అడిగాడు.

అందుకు నారదుడు నవ్వుతూ, "దేవా, మీ ప్రశ్నకు ప్రత్యుత్తరం ఇవ్వటానికి ఎందుకనో నాకు మనస్కరించటం లేదు. తమరే స్వయంగా ఒకసారి భూలోక సంచారానికి బయలుదేరటం ఉత్తమం," అన్నాడు.

విష్ణువు నారదుణ్ణి వెంటబెట్టుకుని భూలోకసంచారానికి బయలుదేరాడు. ఇద్దరూ బాటసారుల వేషాలలో భూలోకానికి దిగి వచ్చారు. వారు ఒకానొక నగరం చేరి, అక్కడ కనిపించిన ఒక పెద్ద భవనం దగ్గరకు వెళ్లారు. భవన ద్వారాలు మూసివున్నవి. విష్ణుమూర్తీ, నారదుడూ ద్వారం దగ్గరకు వెళ్ళి లోపల ఉన్నవారిని కేక వేసి పిలిచారు. లోపల నుంచి జవాబు లేదు.

తరవాత ఇద్దరూ మరొక ఇంటికి వెళ్ళారు. ఆ ఇంటి తలుపులు బార్లా తెరిచి వున్నవి. వారు అక్కడకు వెళ్ళి, "మేము బాటసారులం, ఆకలిగా వుంది. అతిథ్యం ఇవ్వగలరా?" అని అడిగారు.

అందుకు ఆ ఇంటివాళ్ళు చిరచిరలాడుతూ ఏ జవాబూ ఇవ్వకుండానే దభాలున తలుపులు మూసుకున్నారు.

విష్ణువుకు ఈ ప్రవర్తన చాలా ఖేదం కలిగించింది. నారదుడు మాత్రం తల పక్కకు తిప్పుకొని ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు.

కొంతసేపు ఈవిధంగానే ఇద్దరూ మరికొన్ని ఇళ్ళకు వెళ్లారు. "బాటసారులం కరుణించండి,



నాయనలారా!" అంటూ ఆతిథ్యం అందరినీ కోరారు.

"మీకు ఆతిథ్యం కూడానా? పట్టెడు మెతుకులు కూడా పెట్టేది లేదు. వెళ్ళండి," అన్నారు కొందరు.

"పనిచేసుకుని బతక్క, ముష్టి ఎత్తుకోవటం ఎందుకు?" అన్నారు మరికొందరు.

చివరకు విష్ణుమూర్తీ, నారదుడూ ఒక పూరిగుడిసె దగ్గరికి వెళ్ళారు. గుడిసె బయట ఎవరూ లేరు.

ఇద్దరూ అక్కడకు వెళ్ళి గుడిసెలో ఉన్న వారిని పిలిచారు. వారి పిలుపు విని ఒక వృద్ధుడు బయటికి తొంగి చూశాడు. మరు క్షణం అతడు నవ్వుతూ బయటికి వచ్చి, "రండి, నాయనలారా! మీరేదో బాటసారుల లాగా వున్నారు. మేము బీదవాళ్ళమయినా, ఉన్నంతలో మీకు ఆతిథ్యం ఇవ్వగలం," అంటూ ఆహ్వానించాడు.

నారదుడూ, విష్ణుమూర్తీ, ఆ వృద్ధుడి వెనకనే గుడిసెలోకి వెళ్ళారు; అక్కడ ఒక వృద్ధురాలు ఉన్నది. ఆమె ఆ వృద్ధుడి భార్య. అతిథులను చూస్తూనే లేచి ఒక చింకి చాప పరిచి నవ్వుతూ పలకరించింది.

"ప్రయాణ బడలికతో వున్నట్టున్నారు. కాస్త ఓపిక పట్టారంటే భోజనం తయారు చేస్తాను, కూర్చోండి," అన్నది వృద్ధురాలు.

వృద్ధుడు ఆ పూరిగుడిసెలో ఒక మూల నున్న కుండలూ అవీ వెతికి ఇన్ని బియ్యం ఒక చేటలో పోశాడు. వాటిని భార్య చేతికి ఇచ్చాడు. బయటికి వచ్చి గుడిసె మీద వున్న బీర తీగ నుంచి నాలుగైదు కాయలు కోసి భార్యకు ఇచ్చాడు. తరవాత అతిథుల దగ్గరకు వచ్చి, "భోజనానికి కొంత ఆలస్యం అవుతుంది. ఈలోపల ఫలహారం చేద్దురు గాని, కొంత స్తిమితంగా వుంటుంది. ఫలహారమంటే మరేం లేదు, మా పెరట్లో కాసిన దోస పండూ, ఇన్ని గేదె పాలూ," అన్నాడు.

తరవాత అతడు ఒక దోసపండు మధ్యకు కోసి విష్ణువుకూ, నారదుడికీ చెరో ముక్కా ఇచ్చాడు. కుండలో వున్న పాలను రెండు చిన్న ముంతలలో నిండుగా పోసి వారిముందు పెట్టాడు.



ఈ వృద్ధ దంపతులు బీదవారైనా, వారు చేసే మర్యాదకూ, అతిథి సేవకూ విష్ణుమూర్తి చాలా సంతోషపడ్డాడు.

"తాతా, మీకు పిల్లాజెల్లలు లేరా? ఈ ముసలితనంలో మీ పోషణ బాధ్యత వహించే బంధువులెవరైనా వున్నారా?" అని అడిగాడు విష్ణుమూర్తి.

అందుకు వృద్ధుడు నవ్వుతూ, "మాకు పిల్లలు లేరు. ఇక బంధువుల సంగతి చెప్పనే అవసరం లేదు. మాకు మేము తప్ప, ఈ లోకంలో నా అనేవారెవరూ లేరు. ఈ వృద్ధాప్యంలో ఏదో వున్నంతలో సరిపెట్టు కుంటూ కాలం గడుపుతున్నాం," అన్నాడు.

అంతలో విష్ణుమూర్తి ముంతలోని పాలు సగం తాగి కిందపెట్టాడు. అది ఎప్పటిలా నిండుగా తయారైంది. నారదుడు దోస ముక్కను సగం కొరికి చేతిలో పట్టుకు కూర్చున్నాడు. అదీ ఎప్పటిలా సగభాగం చెక్కుచెదరకుండా వుంది.

వృద్ధుడు ఈ వింత చూసి అమితాశ్చర్యం చెందాడు. వీరెవరో దేవుళ్ళో, మహాపురుషులో అనుకున్నాడు. తన భార్య దగ్గరకు వెళ్ళి, "చూశావా, మన ఇంటికి అతిథులుగా వచ్చిన వారు సామాన్యులు కారు. ఇలాంటి వింత చూశాను," అంటూ భార్యకు చెప్పాడు.

ఇక ఆ వృద్ధురాలి ఆశ్చర్యానికీ, ఆనం దానికీ అంతు లేదు. ఆమె చేతులు జోడించి, అతిథులు వున్న చోటుకు వచ్చి, "నాయన లారా! మీరు ఎవరైనది నాబోటి అజ్ఞానురాలు గ్రహించటం సాధ్యమయ్యేది కాదు. కాని, మీరు మహాపురుషులని తెలుసుకున్నాను. మా ఈ బీదగృహాన్ని పావనం చేసేందుకు వచ్చిన మీకు మా అజ్ఞానం వల్ల ఏదైనా లోపం జరిగితే క్షమించండి," అన్నది.

అందుకు విష్ణుమూర్తి నవ్వి, "అవ్వా, మీ ఆతిథ్యానికి చాలా ఆనందం కలుగుతోంది. పిల్లలూ, దగ్గరిబంధువులూ లేకపోయినా కనీసం ఐశ్వర్యమైనా వుంటే, మీరు కొంతలో కొంత అయినా సుఖించగలరు. మీ రిద్దరూ మాతో గుడిసె బయటికి రండి," అన్నాడు.

విష్ణుమూర్తీ, నారదుడూ గుడిసె బయటికి వచ్చారు. వారివెనకనే వృద్ధదంపతులు కూడా

బయటికి వచ్చారు. వారికి భయాశ్చర్యాలు కొలిపే వింత కనబడింది. గుడిసె ముందు కనుచూపుమేరఅంతాఒకేమైదానంలా వుంది. అంతకు ముందున్న మహాభవనాలు ఒక్కటి కూడా కానరాకుండా అదృశ్యమయ్యాయి.

"మహానుభావుల్లారా, ఏమిటీ వింత? ఇక్కడ వున్న ఇళ్ళూ, చెట్టుచేమలూ ఏమయి నాయి?" అని వృద్ధుడు అడిగాడు.

అందుకు విష్ణువు, "అవన్నీ నేలకలి శాయి. ఆకలిగొన్న వారికీ, మార్గాయాసంతో వచ్చినవారికీ పట్టెడన్నం గాని, కూర్చునేందుకు ఇంత చింకి చాప గాని ఇవ్వలేని ఆ గృహ స్థులు మట్టి మీద ఉన్నా, మట్టిలో ఉన్నా ఒకటే. ఇప్పుడు చెప్పండి, మీ కోర్కెలేమిటో?" అని అడిగాడు.

"మేము వృద్ధులం అయ్యాము. మాకు వున్న కోర్కె అల్లా ఒక్కటే, మాకు మరణం ఒకేసారి కలగాలని. అంతవరకూ దైవపూజ చేసుకునేందుకు ఇక్కడ ఒక దేవాలయం వుంటే మేము హాయిగా జీవితాలు గడప గలం," అన్నాడు వృద్ధుడు.

మరుక్షణంలోనే ఆ మైదానంలో చక్కని ఆలయం వెలిసింది. వృద్ధదంపతుల పూరి గుడిసెకు బదులు ఆ ప్రదేశంలో చక్కని భవనం ఏర్పడింది. అప్పుడు విష్ణుమూర్తి ఆ దంపతులను దీవించి, "మీరు నిజమైన మానవమూర్తులు. మీరు జీవించినంతకాలం సుఖంగా జీవించి, తరవాత ఆ ఆలయం ముందు గొప్ప వటవృక్షాలుగా కలకాలం నిలబడతారు," అని చెప్పి నారదుడితో సహా అదృశ్యమయ్యాడు.

ఈ దంపతులు తమకు వచ్చిన ఐశ్వ ర్యంతో దానధర్మాలు చేస్తూ, ఆలయంలో పూజారులుగా చాలాకాలం జీవించారు. మరణానంతరం కూడా ఆలయం ముందు రెండు మహావటవృక్షాలై వెలిశారు.

ఆ వృద్ధదంపతుల ధర్మనిరతీ, భక్తి శ్రద్ధలూ చాలామంది గుర్తించారు. అక్కడ ఉన్న దేవాలయం సాక్షాత్తూ విష్ణువు నిర్మించి నదే అని తెలిసిపోయింది. ఇక అప్పటి నుంచీ ఆ ప్రదేశం ఒక దివ్యక్షేత్రమై కలకల లాడసాగింది.



# చందమామ కబుర్లు

## జంతుప్రదర్శనశాలలో 'మనిషి'



జంతుప్రదర్శనశాలలలో సాధారణంగా రకరకాల జంతువులు, పక్షులు ఉంటాయి. యుగోస్లావియా రాజధాని బెల్‌గ్రేడ్ నగరంలోని జంతుప్రదర్శనశాలలో ఒక మనిషిని కూడా చూపరుల కోసం ఉంచాలని, దాని డైరెక్టర్ నిర్ణయించాడు. ఎందుకంటే మనిషి కూడా నశించి పోతున్న ప్రాణుల జాతికి చెందిన వాడని ఆయన అభిప్రాయ పడుతున్నాడు. అందుకోసం ఉదయం 8 గంటలనుంచి రాత్రి 8 గంటల వరకు బోనులో కూర్చుని చదవడం, టీవీ చూడడం మొదలైన గౌరవప్రదమైన పనులు చేసే 'పార్ట్ టైమ్' ఉద్యోగానికి ఒక మనిషి కావాలని పత్రికలో ప్రకటన ఇచ్చాడు. వెంటనే చాలా దరఖాస్తులు వచ్చాయి. మొట్టమొదటి దరఖాస్తు పంపిన వ్యక్తి నిరుద్యోగి అయిన ఒక కంప్యూటర్ నిపుణుడు!




## వెనక్కు నడవడంలో రికార్డు!

చంద్రన్ అనే యువకుడు కోయంబత్తూరు నెహ్రూ స్టేడియంలో సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు దాదాపు 81 కి. మీ. దూరం వెనక్కు నడిచి సరికొత్త రికార్డు సృష్టించాడు. 12 గంటల వ్యవధిలో స్టేడియాన్ని 76 సార్లు వెనక్కు చుట్టి వచ్చాడు. కోయంబత్తూరులో చేసినట్టే మద్రాసు, ఢిల్లీ మొదలైన నగరాలలో చేయాలని చంద్రన్ అనుకుంటున్నాడు. కరాటేలో 'బ్లాక్‌బెల్ట్' పొందిన చంద్రన్, ప్రతి ఉదయం 10. కి.మీ. దూరం పరిగెత్తుతాడు. వారానికి ఒకసారి 5 కి.మీ. వెనక్కు నడుస్తాడు. కేరళలోని తిరుచ్చూర్‌కు చెందిన చంద్రన్ ప్రస్తుతం కోయంబత్తూరులో ఉంటున్నాడు. మిమిక్రీ, మోనోయాక్టింగ్ అతని హాబీలు.

## మొట్టమొదటి దొంగతనం!

నమ్మశక్యం కాదు కాని, ఇది నిజం! పసిఫిక్ మహాసముద్రంలోని 'కుక్ ఐలండ్' అనే చిన్న ద్వీపదేశంలో ఇంతవరకు ఒక్క దొంగతనం కూడా జరగలేదని పోలీసు రికార్డులు చెబుతున్నాయి. అయితే, గత జూలైలో ఒకడు రారోటాంగాలోని ఒక హొటల్ గది తలుపులు పగల గొట్టి జొరబడి 24,750 అమెరికన్ డాలర్ల విలువ చేసే న్యూజీలాండ్ కరెన్సీ నోట్లు దొంగిలిస్తూ పట్టుబడిపోయాడు. ద్వీపంలో జరిగిన మొట్టమొదటి దొంగతనం ఇదేనని సీనియర్ పోలీసు అధికారులు తెలియజేశారు. స్థానిక రేడియో ఈ వార్తను తెలియజేస్తూ, "కుక్‌ఐలండ్ కూడా మిగతా ప్రపంచంతో జత కలిసింది!" అని వ్యంగ్యంగా వ్యాఖ్యానించింది!

## లిథూనియా ఉదాహరణ

బాల్టిక్ దేశాలలో ఒకటైన లిథూనియా మంత్రిమండలిలోని మంత్రులందరూ వెంటనే పొగ పీల్చడం మాని వేయాలని తీర్మానించారు. పాలకులైన నాయకులే ఆదర్శప్రాయులయినప్పుడు పాలితులైన సామాన్య ప్రజలు వాళ్ళను అనుసరిస్తారు కదా!




# గడుసు అల్లుడు

గోపాలపురం గ్రామంలో వుండే గౌరికి, పట్నంలో ఉద్యోగం చేస్తున్న గిరితో కొత్తగా పెళ్ళయింది. గౌరితల్లి కాంతమ్మ మహాఖర్చు మనిషి. అక్కరలేని వస్తువులు కూడా బోలెడు డబ్బు ఖర్చుపెట్టి కొని, దాచుకోవడం ఆమెకు అలవాటు. భర్త భుజంగం ఆమెకు ఎన్ని విధాలుగానో చెప్పి చూశాడు. ఆమెలో ఎటువంటి మార్పూ రాలేదు. పైపెచ్చు ఆమె చాలా పనులు భర్తకు తెలియకుండా చేస్తూండేది.

గౌరిని కాపరానికి పంపిస్తూ, కాంతమ్మ, "ఒసే, వెర్రిమొహంలా ప్రతిదీ మొగుడితో మొరబెట్టుకోకు. ఆడవాళ్ళను అడ్డుకోవడమే పనిగా పెట్టుకుంటారు వాళ్ళు. అందుకే, మనం చాలా పనులు మగవాళ్ళ చెవిని వేయకుండా చేసుకుపోతూండాలి," అంటూ కూతురుకు నూరిపోసింది.

తర్వాత ఆమె సామాను లెక్క చూస్తున్న గిరితో, "చూడల్లుడూ! మీ మామకు ఒక అచ్చటాముచ్చటా తెలీదు. పెళ్ళయినరోజు నుంచి అత్తరు తెమ్మని పోరుపెడుతున్నాను. ఈ నాటికీ తేలేదు. పట్నంలోని దుకాణాల్లో రకరకాల అత్తర్లు దొరుకుతాయట. పండక్కి వచ్చేప్పుడు గులాబీ అత్తరు తీసుకురా!" అన్నది.

గౌరి కల్పించుకుని,"అడిగిందితీసుకురాని భర్తతో, మాఅమ్మ కాబట్టి ఇన్నాళ్ళు కాపరం చేయగలిగింది. ఇటువంటి కాపరం పగవాళ్ళకి కూడా వద్దు!" అన్నది పయిటచెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

ఇంతలో గౌరి తండ్రి భుజంగం, గదిలోకి రావడంతో ఆ ప్రసంగం కట్టిపెట్టారు తల్లీ కూతుళ్ళు.

గౌరి కాపరానికి వచ్చిన రోజునుంచీ అరువు మీద రకరకాల చీరెలూ, పాత్రలూ, ఇంటి అలంకరణ సామగ్రీ కొనడం ఆరంభించింది.

మాచిరాజు కామేశ్వరరావు



"ఇప్పుడు ఈ దండగ ఖర్చు ఎందుకు చెప్పు? మనకు వాటి అవసరం లేదుకదా!" అని భార్యకు నచ్చచెప్పాలని చూశాడు గిరి.

"మా అమ్మలా నేను సత్తెకాలపు దాన్ని కాదు, భర్తకు భయపడుతూ బతకడానికి. మా అమ్మ మాట వేదవాక్కు నాకు!" అన్నది గౌరి.

దీపావళి పండగ దగ్గిరపడింది.

"రేపే మన ప్రయాణం. అమ్మ తీసుకు రమ్మన్న గులాబీఅత్తరు సాయంత్రం తీసుకురా!" అన్నది గౌరి భర్తతో.

ఆ సాయంత్రం బాగా చీకటి పడినా గిరి జాడలేదు. గౌరి కంగారు పడసాగింది. బాగా పొద్దుపోయి తూలుతూ వచ్చి కుర్చీలో కూలబడ్డాడు గిరి.

"ఏమిటలా వున్నావు? ఏం జరిగింది?" అని ఆతృతగా అడిగింది గౌరి.

గిరి పెద్దగా నిట్టూర్చి ఆయాసపడుతూ, "ఏం చెప్పను! అత్తగారు తెమ్మన్న అత్తరు నిలువునా కొంపముంచింది. ఆ గులాబీ అత్తరుందే – అది మీ అమ్మవాళ్ళ వయసు రోజుల్లో మాటేమోగాని, ఇప్పుడు రాసుకోవడం పాతకాలపు పద్ధతట! అందువల్ల, ఏ దుకాణంలోనూ దొరకలేదు. చివరకు ఒక చెట్టు కింద అద్దాలపెట్టెలో అత్తరు సీసాలు పెట్టుకుని కూర్చున్నవాడి దగ్గిర, అది కనబడింది. కోరమీసాలూ, గిరజాల జుట్టూ వాడూ! దొంగ వెధవని చూస్తూనే గ్రహించలేకపోయాను. ఇదుగో, గులాబీ అత్తరంటూ ఏదో వాసన చూపించాడు. అంతే! మళ్ళీ స్పృహ వచ్చేసరికి వాడులేడు. ఎదురుగా చెట్టు మాత్రం వుంది," అన్నాడు.

గౌరి దిగులుగా, "అయ్యో! మరిప్పుడా గులాబీఅత్తరెక్కడ దొరికేట్టు!" అన్నది.

"దాని మాట దేవుడి కెరుక! ముందు, ఈ సాయంత్రమే కచేరీలో పుచ్చుకున్న జీతం డబ్బు, వెయ్యి రూపాయిల సంగతేమిటి? మీ ఇంటికి వెళ్ళాక, నష్టపోయిన ఈ వెయ్యి రూపాయిలూ, మీ అమ్మ దగ్గిర వసూలు చెయ్యి, తెలిసిందా? అలా కాకపోతే, పండగయ్యాక, పట్నానికి తిరిగి వచ్చేది, నేనొక్కడినే," అన్నాడు గిరి కోపంగా.



"నీ కోసం అత్తరు కొనబోబట్టే గదా, ఈ అనర్థం జరిగింది. నువ్వు డబ్బివ్వకపోతే, శిక్ష నాకా? ఇది మాత్రం బావుందా?" అంటూ రెట్టించింది గౌరి.

"నా చేతిలో చిల్లి గవ్వలేదు. మీ నాన్నకు తెలిస్తే,నాప్రాణాలుతీస్తాడు,"అన్నది కాంతమ్మ.

"నాన్నకు తెలీయకుండా నువ్వెన్నో పనులు చేస్తూంటావుగా. అలాగే ఏదో ఒకటి చేసి, వెయ్యిరూపాయిలూ అల్లుడి కందేలా చూడు," అన్నది గౌరి.

కాంతమ్మ కాసేపాలోచించి, "అంతా నా ఖర్మ! తప్పుతుందా మరి. ఈ గండంనుంచి గట్టెక్కడానికి ఇలాచేద్దాం!"అని, ఏంచేయాలో గౌరికి చెప్పింది.

గౌరి భయపడిపోయింది. భర్తను అంత కోపంలో చూడడం,ఆమెకు అదే మొదటి సారి.

బాడుగబండిలో పుట్టిల్లు చేరాక గౌరి, తల్లిని పెరట్లోని బాదంచెట్టు కిందికి తీసుకు పోయి అదేదో గులాబీఅత్తరో, మల్లెపూల త్తరో, నా కాపరం చెరిచేలా వుందే, అమ్మా!" అంటూ జరిగిందంతా చెప్పి, "ఆ వెయ్యి రూపాయిలు నువ్వు ఇస్తేనే, ఆయన నన్ను పట్నం తీసుకుపోతాడు," అన్నది.

కాంతమ్మ నిర్ఘాంతపోయి, "ఎవడో చెట్టు కింది చోరీవెధవ దోచుకున్నదానికి,నేను నష్ట పరిహారం చెల్లించాలా? ఇది మరీ బావుంది!" అంటూ దీర్ఘాలు తీసింది.

డబ్బులుండే పెట్టె తాళంచెవి ఎప్పుడూ భుజంగం తన దగ్గిరే వుంచుకుంటాడు. ఆ పెట్టె మీద పాత సామానులున్న బరువు పెట్టె ఒకటుంది. దాన్ని దించడం ఆడవాళ్ళ తరం కాదు. ఒక రాత్రివేళ, భర్త తలదిండు కింది నుంచి తాళంచెవి తీసి అల్లుడి చేతి కిస్తుంది, కాంతమ్మ. గిరి చడీచప్పుడూ లేకుండా సామానులున్న పెట్టె దించి, డబ్బున్న పెట్టెలోంచి వెయ్యిరూపాయిలు తీసుకోవాలి!

అత్తా,భార్యా చెప్పిందంతా విని గిరి, ససేమిరా తాను దొంగతనం చెయ్యనన్నాడు.

ఇందుకు కాంతమ్మ విసుక్కుని,"అల్లుడూ, అట్టే బస్తీ బడాయిలు పోకు! ఇది దొంగ

తనం ఎలా అవుతుంది? నీ పోయిన డబ్బు నువ్వు తీసుకుంటున్నావు. దీన్ని దొంగతనం అని బుద్ధి వున్నవాడెవడూ అనడు," అన్నది.

"ఆ మాటా నిజమే!" అని గిరి తలాడించాడు.

కాంతమ్మ పథకం ఏ అవాంతరాలూ లేకుండా సఫలమైంది. తెల్లవారి పండగ! ఉన్న నగలన్నీ అలంకరించుకుందామని కాంతమ్మ, పెట్టె తెరవమని భర్తను పురమాయించింది.

పాతసామానుల బరువుపెట్టెను దించి, డబ్బుపెట్టె తాళం తీశాడు భుజంగం. లోపల నగల పెట్టెలు చెల్లాచెదురుగా పడివున్నవి. వాటిలో ఒక్క నగ కూడా లేదు. అది చూసి కాంతమ్మ కెవ్వుమన్నది.

"మూసినపెట్టె మూసి నట్టుండగానే, నగలన్నీ ఏమైపోయాయి?" అన్నాడు భుజంగం ఆశ్చర్యంగా.

"ఇదంతా కోరి తెచ్చుకున్న, ఆ పట్నం కుర్రాడి పని!" అని, కాంతమ్మ పెద్దగా కేకలు పెడుతూ, గిరి వున్న గదిలోకి వెళ్ళి, "ఇదేమైనా మర్యాదయిన పనేనా? అత్తగారి నగలు దొంగిలించడం గోహత్యతో సమానమని తెలీదా? అదీ పండగ పూట! ఏవీ, నా నగలన్నీ నాకళ్ళముందు పెట్టు, లేకపోతే కళ్ళు తిరిగి పడిపోగలను," అన్నది.

గిరి అమాయకంగా ముఖం పెట్టి, "అల్లుణ్ణి పండగకు పిలిచి దొంగతనం అంటగడతారా? ఇదేనా, ఈ ఇంటి మర్యాద? ఒక్క క్షణం కూడా, ఈ ఇంట్లో వుండను!" అన్నాడు కోపంగా.



"ముందు నా నగలన్నీ ఇచ్చి, నీ దారిన పో. పెట్టె తెరిచి వెయ్యిరూపాయిలు తీసుకో మంటే, నగలు కూడా దోచుకుంటావా?" అన్నది కాంతమ్మ కళ్ళనీళ్ళతో.

"నన్ను పెట్టెతెరిచి వెయ్యి రూపాయిలు తీసు కోమన్నారా? అంతా కట్టుకథ!" అన్నాడు గిరి.

భుజంగం కల్పించుకుని, "కాంతం, కాస్త ఒళ్ళుదగ్గిరపెట్టుకుని మాట్లాడు! గిరి దొంగలా పెట్టె తెరిచి డబ్బూ, నగలూ ఎందుకు తీసు కుంటాడు?" అని అడిగాడు.

"నన్ను క్షమించండి!" అంటూ కాంతం, భర్త పాదాల మీదపడి జరిగిందంతా చెప్పింది.

భుజంగం ఆమెను ఓదారుస్తూ, "నీ నగలు ఎక్కడికీ పోలేదు, కాంతం. ఇదంతా నేనూ, అల్లుడూ కలిసి ఆడిన నాటకం. ఆ రోజు నువ్వు అల్లుడిని పట్నం నుంచి అత్తరు తీసుకురమ్మనడం, పక్క గదిలో వున్న నేను విన్నాను. ఈ వయసులో అత్తరుతో నీకేం పని అని అడిగి, నిన్ను చిన్నబుచ్చ దలచ లేదు. భర్తకు తెలియకుండా అతి గోప్యంగా అర్థంపర్థంలేని పనులు చేయడం, ఎలాంటి అనర్థాలకు దారితీస్తుందో తెలియజెప్పడానికే నేనూ, అల్లుడూ ఈ నాటకం ఆడాం. ఇదంతా ముఖ్యంగా, నీ చెప్పుచేతల్లో నడుచు కుంటున్న అమ్మాయి కళ్ళు తెరిపించడానికి చేసినవి. దీనికంతకూ సూత్రధారి అల్లుడు గిరి. మొత్తానికి మన అమ్మాయి గౌరికి ఇంత ఇంగితజ్ఞానం నేర్పగల గడుసుఅల్లుడు!" అన్నాడు.

గౌరి సిగ్గుతో తలవంచుకున్నది. కాంతమ్మ ఉక్రోషంగా భర్తతో, "ఇంత కాలానికి నాకు బాగానే బుద్ధి చెప్పారు. అయినా, ఈ కాస్త విష యానికి అంతసేపు మాట్లాడాలా!" అన్నది.

భుజంగంతృప్తిగానవ్వుకున్నాడు. గిరి జేబు లోంచి ఒక చిన్న సీసా తీస్తూ, "అత్తగారూ! ఇదిగోనండి, మీ గులాబీఅత్తరు," అన్నాడు.

"అదేదో గౌరికివ్వు, అల్లుడూ! నేను తీసు కుంటే, ఇంకా బుద్ధికుదర్లేదని మీ మామ గారు మళ్ళీ ఇంకో నీతిశతకం వల్లెవేయ గలరు!" అన్నది కాంతం.

ఆ మాటలకు భుజంగంతో పాటు, గౌరీ, గిరీ కూడా పెద్దగా నవ్వారు.





# ఎకోతో ముఖవైఖరులను తయారుచేయండి!

ఎకో స్కెచ్ పెన్నులతో కృత్రిమ ముఖములను తయారు చేయడం ఎంతో సరదా మాత్రమే
కాకుండా అది ఎంతో ఉల్లాసవంతమైన వేడుక కూడాను!
ఎకో అనేక ప్రకాశవంతమైన రంగులలో, 12, 24, మరియు 30 పెన్నులుగల ప్యాక్‌లలో లభిస్తుంది.
అయితే అన్నింటికన్నా అత్యుత్తమమైన విషయమేమిటంటే, ఎకో నీటి-ఆధారముతో కూడినదై యుండి మరియు
విషపూరితము-కానిది. కనుక, ఉపయోగించుకోడానికి అది మీకు సంపూర్ణముగా సురక్షితమైనదిగా ఉంటుంది.
ఒక్కసారి ఆలోచించు అదంటే అమ్మ ఎంతగా ఇష్టపడుతుందో.

గెలుచుకోండి వేలకొలది బహుమతులు!

ఎకో అంటే అంతులేని వినోదం!






## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1993 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


D.N. Prasad


Devidas Kasbekar

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *సెప్టెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తప్పదు శ్రమ! రెండవ ఫోటో : జాగ్రత్త సుమా!

పంపినవారు : పి. వాణిశ్రీ, భద్రాచలం - 507 111, ఖమ్మంజిల్లా. (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

